

(శ్రీ మద్దయానంద మహర్షి ప్రదర్శిత)

# వైదిక దినచర్య

## (సంధ్యాగ్ని హోత్రాదులు)



సంకలన కర్త :

"కళాప్రపూర్ణ" పండిత గోపదేవ్

ప్రకాశకులు :

ఆర్య సమాజము, కూచిపూడి - 522 313

(తెనాలి తాలూకా - గుంటూరు జిల్లా)

వైదిక ధర్మ ప్రచార సమితి, సికింద్రాబాద్

నవంబర్ - 2015

| | |
|---|---|
| 19వ ముద్రణ వరకు | 64000 ప్రతులు |
| ప్రస్తుతం 20వ ముద్రణము | 3000 ప్రతులు |
| మొత్తము | 67000 ప్రతులు |

మూల్యము : ₹ **15-00** (ప్రత్యేక తగ్గింపు ధర)

పోస్టు ద్వారా ప్రతులకు :

1. ఆర్య సమాజము, కూచిపూడి - 522 313 (తెనాలి తాలూకా
గుంటూరు జిల్లా. ఫోన్ : 08644-252789

ప్రతులకు :

1. మాశెట్టి శ్రీనివాస్ ఆర్య, షాప్ నెం. 5, మాశెట్టి బిల్డింగ్, 3-3-736 నుండి 740, కంచరి బజార్, సికింద్రాబాద్.
ఫోన్ : 6632 0200
2. వైదిక సాహిత్య భండార్, సుల్తాన్ బజార్, హైదరాబాద్.
ఫోన్ : 24751656
3. ఆర్య సమాజము, సీతాఫలమండి, సికింద్రాబాద్ - 61
4. శ్రీ విద్యా బుక్ డిపో, సుల్తాన్ బజార్, హైదరాబాద్.

Designed & Printed at
PRINTSHOP
Sec'bad. Ph : 6632 0300

# తొలి పలుకులు

మానవజీవితము బహు మూల్యము, ఇతర ప్రాణులు తమ జీవితసాఫల్యమును గూర్చి యాలోచింపనేరవు. విధి నిషేధములు వానికుండవు. మానవుడట్లుకాక మంచి చెడుగులను వివేచింపగలడు. జీవిత లక్ష్యమును పరమాత్మ సాక్షాత్కారమును పొందుటకువలయు విధానముల నేర్పఱచుకొన గలడు. అతని జీవిత సాఫల్యము అతని దినచర్యమీద ఆధారపడియుండును. అతనికి కొన్ని విధులు, కొన్ని నిషేధములునున్నవి. అతడు సామాజికప్రాణి. ఒంటరిగ నుండువాడు కాడు. సమాజశాంతికి భంగము కలిగింపక తన యున్నతికై యత్నించును. అందులకై ప్రాత: కాలమున నిద్రనుండి మేల్కొనినది మొదలు రాత్రి నిద్రపోవు సమయము వఱకు గల తన చర్యలను లక్ష్యసిద్ధి కనుకూలముగ నుండునట్లు నిర్ణయించు కొని, జీవిత లక్ష్యమును పొందుటకై నిరంతరము యత్నింపవలసియున్నది.

ప్రాచీన మహర్షులు వేదశాస్త్రములను పరిశీలించి మానవుని దినచర్యలను నిర్ణయించియున్నారు. ఆ దినచర్యలకు చెందిన విధివిధానముల ననుసరించియే యీ చిన్న పొత్తము రచియింప బడినది. ఇందు చూపబడిన విధులు, వేదమూలకములు, మంత్రసహితములు, మహర్షి ప్రదిష్టములు. సులభమైన భాషలో నెల్లరికి నందుబాటులో నుండునట్లు రచింపబడినవి.

పరమశాంతి నభిలషించువారు, మోక్షము నభికాంక్షించువారు నీ విధులను నిత్యమనుసరింతురని మా విశ్వాసము

1. బ్రహ్మయజ్ఞము(సంధ్యోపాసనము) 2. దేవయజ్ఞము 3. పితృయజ్ఞము 4. భూత(బలివైశ్వదేవ) యజ్ఞము 5. అతిథి(నృ) యజ్ఞము - అను పంచమహా యజ్ఞములను చేయు విధమిందు పాఠకులు దెలిసికొనగలరు.

పండిత గోపదేవ్

# విషయసూచిక

ఓమ్

# వైదిక దినచర్య

## ప్రాతః స్మరణము

తెల్లవాఱకముందే 4 గంటలకు లేచి శయ్యమీద కూర్చుండి భగవంతుని నీక్రింది మంత్రములతో స్మరింపవలయును.

**ఓం ప్రాత రగ్నిం ప్రాత రింద్రం హవామహే**
**ప్రాత ర్మిత్రా వరుణా ప్రాత రశ్వినా**
**ప్రాత ర్భగం పూషణం బ్రహ్మణస్పతిం**
**ప్రాతః సోమ ముత రుద్రం హువేమ.** (ఋ. 7-41-1)

**అర్థము:-** ప్రాతః - ప్రాతఃకాలము, అగ్నిం - దేవుని ప్రకాశ శక్తిని, ఇంద్రం - ఐశ్వర్యశక్తిని, హవామహే - మేము కోరుచున్నాము. ప్రాతః - ప్రభాతమున, మిత్రావరుణా - ప్రాణ ఉదానములను, అశ్వినా - దేవుని లోకాలోకశక్తులను కోరుచున్నాము. ప్రాతః - ప్రాతఃకాలమున, భగం - భజింపదగినట్టియు, పూషణం - పుష్టినిచ్చునట్టియు, బ్రహ్మణస్పతిం - పరమేశ్వరుని, సోమం - సౌమ్యభావమును, ఉతరుద్రం - మఱియు ఉగ్రభావమును, హువేమ - కోరుచున్నాము.

**ఓం ప్రాత ర్జితం భగ ముగ్రం హువేమ**
**వయం పుత్ర మదితేర్ యో విధర్తా**
**ఆధ్ర శ్చిద్యం మన్యమాన స్తురశ్చిద్**
**రాజాచిద్యం భగం భక్షీత్యాహ.** (ఋ. 7 41-2)

**అర్థము:-** యో విధర్తా - ఎవడు లోకధారకుడో, చిత్ - ఆదరణీయుడో, ఆధ్రః - సర్వవిధముల ధారణ చేయదగినవాడో, మన్యమానః- మాననీయుడో, తురః - శీఘ్రకారియో, రాజాచిత్ - ప్రకాశించువాడో, భక్షి - "నేను సేవింతును' ఇత్యాహ - అని యనునో, ప్రాతర్జితమ్ - ప్రాతః ప్రాప్తింపదగు నా దేవుని, ఉగ్రం - తేజోవంతుని, అదితేః అదితి (ఆకాశము) యొక్క, పుత్రం - పుత్రుని (సూర్యుని) యో విధర్తా - ఎవడు ధారకుడో వానిని, వయం - మేము, హువేమ - ఆహ్వానించుచున్నాము.

**ఓం భగ ప్రణేతర్ భగ సత్యరాధో**
**భగేమాం ధియ ముదవాదదన్నః**
**భగ ప్రణో జనయ గోభిరశ్వైర్**
**భగ ప్రన్నృభిర్ నృవంతః స్యామ.** (ఋ. 7-41 3)

**అర్థము:-** భగ:- ఓ భజనీయ! ప్రణేతః :-మార్గదర్శక! భగ:- ఓ యైశ్వర్యసంపన్న! సత్యరాధః :- ఓ సత్యధనీ! భగ:- ఓ యైశ్వర్యదాత! నీవు, ఇమాం ధియం - ఈ బుద్ధిని, దదత్ - ఇచ్చుచు, నః - మమ్ములను, ఉత్ అవ - రక్షింపుము. భగ! - ఓ భగవన్, నః-మమ్ములను, గోభిః-గోవులతోను, అశ్వైః-గుఱ్ఱములతోను, ప్రజనయ - జన్మింపజేయుము. భగ:- ఓ దేవ! నృభిః - నాయకులతోకూడి, నృవంతః - నాయకులుగల వారముగ, ప్రస్యామ - అగుదుముగాకః

**ఓం ఉతేదానీం భగవంతః స్యామ**
**ఉత ప్రపిత్వ ఉత మధ్యే అహ్నామ్**
**ఉతోదితా మఘవన్ త్సూర్యస్య**
**వయం దేవానాం సుమతౌ స్యామ.** ( ఋ. 7-41-4 )

**అర్థము:-** మఘవన్! - పరమేశ్వర! ఉతేదానీం-ఇప్పుడును, ఉత అహ్నాం మధ్యే - ఇతరసమయములందును, భగవంతః స్యామ - ఐశ్వర్యవంతుల మగుదుముగాక! ఉతసూర్యస్య - సూర్యుని, ఉదితా - ఉదయకాలమున, వయం - మేము, దేవానాం - విద్వాంసుల, సుమతౌ స్యామ - మంచిబుద్ధిలో నుందుముగాక!

**ఓం భగ ఏవ భగవాఁ అస్తు దేవా**
**స్తేన వయం భగవంతః స్యామ**
**తం త్వా భగ సర్వ ఇజ్జోహవీతి**
**స నో భగ పుర ఏతా భవేహ.** ( ఋ. 7-41-5)

**అర్థము:-** భగవాన్! - పరమేశ్వర! నీవే, భగ ఏవాస్తు - భజింపదగినవాడ వగుదువుగాక ! తేన - అందుచేత, వయం - మేము, దేవాః - జ్ఞానులము, భగవంతః-ఐశ్వర్యవంతులము, స్యామ-అగుదుముగాక! భగ:-ఓస్వామి! తం

త్వా-అనిన్ను, సర్వ ఇత్-విశ్వమంతయు, జోహవీతి-స్తుతించుచున్నది. భగ!-స్వామీ! సః-ఆ నీవు, ఇహ-ఈ లోకమున, నః-మాకు, పుర ఏతా భవ-నాయకుడవగుము.

## స్నాన మంత్రములు

ప్రాతఃస్మరణ మొనర్చి, తరువాత శౌచకృత్యమును దీర్చుకొని ఈ క్రింది మంత్రములను చెప్పుకొనుచు స్నానమొనర్పవలయును.

**ఓం ఆపో హి ష్ఠా మయోభువ**
**స్తా న ఊర్జే దధాతన**
**మహే రణాయ చక్షసే. (ఋ. 10-9-1)**

**అర్థము:-** హి - వాస్తవమున, ఆపః -జలమే, మయోభువః - సుఖదాయకము, ష్ఠా - స్థ - అగును, తాః నః - ఆ జలమే మనకు, ఊర్జే - బలమును, మహే - మహత్త్వమును, రణాయ - వాగ్బలమును, చక్షసే - దృష్టి శక్తిని, దధాతన - ధరించునుగాక - ఇచ్చునుగాక!

**ఓం యో వః శివతమో రస**
**స్తస్య భాజయతేహ నః**
**ఉశతీరివ మాతరః (ఋ. 10-9-2)**

**అర్థము:-** యో వః - ఏ నీయొక్క, శివతమో రసః-ఉత్తమ రసముగలదో, ఉశతీః - సంతానమును గోరు, మాతర ఇవ-తల్లులవలె, తస్య - ఆ రసమును, ఇహ నః - ఈ లోకమున మేము, భాజయత - అనుభవించునట్లు చేయుము.

**ఓం తస్మా అరం గమామ వో**
**యస్య క్షయాయ జిన్వథ**
**ఆపో జనయథా చ నః (ఋ. 10-9-3)**

**అర్థము:-** వః - జలముయొక్క తస్మై - ఆ రసమును, అరంగమామ - బాగుగ పొందుదుముగాక! క్షయాయ - వృద్ధికి, జిన్వథ - అనుకూలింతువు, ఆపః - జలము, నః - మాకు, జనయథ - అన్నము నుత్పన్నము చేయుగాక!

# యజ్ఞోపవీత ధారణ మంత్రము

బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థాశ్రమములం దుండి ఆ యాశ్రమ ధర్మముల పాలించుచున్నంతవఱకు మానవులు యజ్ఞోపవీతములు ధరించి యుండవలయు ననునది వైదికుల మతము. కాబట్టి తాను ధరించిన యజ్ఞోపవీతము జీర్ణమైపోయినపుడు వెంటనే మఱియొక క్రొత్త జందెమును ధరింపవలయును. అట్లు జందెము ధరించుటకు ముందు ఆచమన మంత్రములతో ముమ్మాఱాచమనముచేసి, మఱియు అంగస్పర్శ మంత్రములతో అంగములను స్పృశింపవలయును. పిదప క్రొత్త జందెమును సరిచేసి రెండు చేతులతోను పట్టుకొని,

**ఓం యజ్ఞోపవీతం పరమం పవిత్రమ్**
**ప్రజాపతేర్యత్సహజం పురస్తాత్**
**ఆయుష్యమగ్ర్యం ప్రతిముంచ శుభ్రం**
**యజ్ఞోపవీతం బలమస్తు తేజః**

అని యుచ్చరించి దానిని ధరింపవలయును. అటుపై గాయత్రిని జపించి పాత జందెమును తీసివేయవలయును. తరువాత పైన చెప్పినట్లు మరల ముమ్మాఱాచమించి అంగస్పర్శ నొనరింపవలయును.

**ఓం యజ్ఞోపవీతమసి యజ్ఞస్య త్వా**
**యజ్ఞోపవీతేన ఉపనహ్యామి.**

# సంధ్యోపాసనము (బ్రహ్మ యజ్ఞము)

బ్రహ్మనుపాసించు వ్యక్తి రాత్రిందినముల సంధిసమయమున నిత్యము నుపాసింపవలయును. ప్రకాశము, అంధకారమునను వీని సంయోగ సమయము సంధ్యాకాల మని యెఱుగునది. అపుడు చేయు ధ్యానక్రియ సంధ్య యనబడును. ఒక్క భగవంతుని తక్క యెవరిని ఉపాసింపజనదు. నిత్యము రెండు వేళలందును సంధ్యోపాసన చేయవలయును.

మొదట కనీసము ముమ్మాఱు ప్రాణాయామము చేయ వలయును. ఊపిరితిత్తులలో నిండియుండు వాయువును నాసికా పుటములద్వారా బలపూర్వకముగ బయటికి తీసి (రేచించి-నిశ్వసించి) శక్తి కొలది కొంతతడవు గాలిని లోపలికి పోకుండ నుంచవలయును. తరువాత నెమ్మదినెమ్మదిగ గాలిని లోపలికి తీసికొనవలయును. మరల బయటికి విడిచి యట కొంత తడవు ఆపియుంచవలయును. ఇట్లు ముమ్మాఱుబాహ్యకుంభకము కనీసము చేయవలయును. దీనివలన మనస్సు, ఆత్మయు స్థిరము లగును. అటుపై గాయత్రీ మంత్రము నుచ్చరించుచు తల వెండ్రుకలు ముడివేసికొనవలయును. ముడివేయుట వలన కేశము లిటునటు చెదరక ఉండును. గాయత్రీ మంత్రముతో పరమేశ్వరుని ప్రార్థించుట వలన సత్కార్యములందు మనుజులకు రక్షణ కలుగును.

# గాయత్రీ మంత్రము

## ఓం భూర్ భువః స్వః తత్సవితుర్వరేణ్యమ్, భర్గో దేవస్య ధీమహి, ధియో యో నః ప్రచోదయాత్.

(యజు. 36-3 ఋ.3-62-10)

సామ.ఉ.అ.6 ప్ర. 13 అధ్యా. (1462మం)

## ఆచమన మంత్రము

**ఓం శన్నో దేవీ రభిష్టయ, ఆపో భవంతు పీతయే,**

**శంయోరభిస్రవంతు నః**(యజు. 36-12)

(అప్ల వ్యాప్తౌ - ధాతువుచే అప్ శబ్దము సిద్ధించును. అది స్త్రీలింగము, బహువచనాంతము. క్రీడ మున్నగు అర్థములుకల 'దివు ధాతువు వలన దేవీశబ్దము సిద్ధించును.)(దేవ్య ఆపః) సర్వమును ప్రకాశింపజేయునట్టియు, ఆనందదాతయు, సర్వ వ్యాపకుడునగు నీశ్వరుడు, (అభిష్టయే) మనోవాంఛిత ఆనందముకొఱకును, (పీతయే) పూర్ణానంద ప్రాప్తికొఱకును, (నః) మాకు (శం) శుభమునిచ్చువాడు, (భవంతు) ఆగుగాక! (తా ఆపో దేవ్యః) ఆ పరమేశ్వరుడే (నః) మాపై (శంయోః) సుఖమును, (అభిస్రవంతు) వర్షించుగాక! ఇట్లు పరమేశ్వరుని ప్రార్థించి ముమ్మాఱు ఆచమనము చేయవలయును. జలము లేకున్న చేయకుండవచ్చును. ఆచమనమువలన కంఠమునందలి కఫాదులు పోగలవు.

## ఇంద్రియ స్పర్శమంత్రములు

**ఓం వాక్ వాక్ ఓం ప్రాణః ప్రాణః ఓం చక్షుః చక్షుః**
**ఓం శ్రోత్రం శ్రోత్రమ్. ఓం నాభిః ఓం హృదయమ్.**
**ఓం కంఠః ఓం శిరః ఓం బాహుభ్యాం యశోబలమ్.**
**ఓం కరతల కరపృష్ఠే.**

ఇట్లు ఈశ్వరప్రార్థనాపూర్వకమగు నీ మంత్రములతో ఇంద్రియములను స్పృశింపవలయును. ప్రార్థనవలన ఇంద్రియములన్నియు బలము కలవియై యుండునని అభిప్రాయము.

## (ఈశ్వర ప్రార్థనాపూర్వక) మార్జన మంత్రములు

**ఓం భూః పునాతు శిరసి, ఓం భువః పునాతు నేత్రయోః**
**ఓం స్వః పునాతు కంఠే. ఓం మహః పునాతు హృదయే.**
**ఓం జనః పునాతు నాభ్యామ్. ఓం తపః పునాతు పాదయోః**
**ఓం సత్యం పునాతు పునఃశిరసి. ఓం ఖం బ్రహ్మ పునాతు సర్వత్ర.**

ఓంకారము, భూః,భువః స్వః వీని యర్థములు గాయత్రీ మంత్రార్థమున చూచునది. (మహః)అన్నిటికంటె పెద్దయు, పూజ్యుడు నగుటచే పరమేశ్వరునకు మహస్సనిపేరు. సర్వజగత్తు నుత్పన్నము చేయుటచే అతనిని (జనః) జనుడని యందురు. దుష్టులకు సంతాపము నిచ్చు జ్ఞానస్వరూపుడగుటచే(తపః) తపస్సందురు. ఇందుకు 'యస్యజ్ఞానమయం తపః' అను ముండకోపనిషత్ వాక్యము ప్రమాణము. అవినాశి యగుటచే (సత్యం) పరమేశ్వరుడు సత్య మనబడును. వ్యాపకుడగుటచే (బ్రహ్మ)యనబడును. ఇట్లు పరమేశ్వరుని నామార్థములను స్మరించుచు మార్జనము (ఆయా అంగములపై నీరుచల్లుట) చేసికొనవలయును.

## ప్రాణాయామ మంత్రము

**ఓం భూః ఓం భువః ఓం స్వః ఓం మహః**
**ఓం జనః ఓం తపః ఓం సత్యమ్. (తై. ఆ. 10-17)**

వీనిని అర్థముతోబాటు మనస్సునందుచ్చరించుచు పూర్వము చెప్పినట్లు ప్రాణాయామములను చేయవలయును.

## అఘమర్షణ మంత్రములు

**ఓం ఋతం చ సత్యం చాభీద్ధాత్తపసోzధ్యజాయత,**
**తతో రాత్ర్యజాయత, తతః సముద్రోఅర్ణవః**
**ఓం సముద్రాదర్ణవాదధి సంవత్సరో అజాయత,**
**అహోరాత్రాణి విదధద్విశ్వస్య మిషతో వశీ.**
**ఓం సూర్యాచంద్రమసౌ ధాతా యథాపూర్వ మకల్పయత్,**
**దివం చ పృథివీం చాంతరిక్షమథో స్వః** (ఋ. 10-190-1, 2,3)

ఈశ్వరుని స్తుతించి పాపములనుండి దూరముగా నుండుమని యుపదేశించు మంత్రములు అఘమర్షణ మంత్రములనబడును.

(ధాతా) సమస్త జగత్తును ధరించి పోషించువాడును, (వశీ) అన్నిటిని వశమునందుంచుకొనువాడును నైన పరమేశ్వరుడు (యథాపూర్వం) సర్వజ్ఞుడై తన విజ్ఞానమున నున్న జగద్రచనాజ్ఞానము ననుసరించియు, జీవుల పుణ్యాపాపముల ననుసరించియు మనుష్యాదిప్రాణులను రచించెను.

(సూర్యాచంద్రమసౌ) పూర్వకల్పమునందువలె సూర్య చంద్రుల నీకల్పమున రచించెను, (దివం) సూర్యాదిలోకముల ప్రకాశమును సృష్టించెను, (పృథివీం) కనబడుచున్న భూమిని, (అంతరిక్షం) పృథివీ దివ(సూర్యలోక)ముల మధ్యభాగమును, (స్వః) ఆకాశమునందలి లోక ములనన్నిటిని, (అకల్పయత్) ఈశ్వరుడు రచించెను. జగదీశ్వరుడు అనాది కాలమునుండి లోకలోకాంతరములను రచించున ట్లీకల్పమునందును రచించినాడు. ఇకముందు నిట్లే రచించును. ఈశ్వరుని జ్ఞానమెన్నడు విపరీతము కాదు. పూర్ణము ననంతము నగుటచే నేకరసమైయుండును. అందు వృద్ధి క్షయములు, వైపరీత్యము నెన్నడు కలుగవు. అందువలననే యథాపూర్వమ్' అని వాడబడినది.

(విశ్వస్య మిషతః) ఆ ఈశ్వరుడే తన సహజస్వభావముతో జగత్తున రాత్రిందివములు,ఘడియలు, విఘడియలు, పూర్వమున్నట్లు (విదధత్) రచించినాడు. ఈశ్వరుడు దేనితో నీ జగత్తును రచించినాడని శంకించిన: (అభీద్ధాత్తపసః) తన యనంత సామర్థ్యముతో జగత్తును రచించెనని యుత్తరము చెప్పునది. ఈశ్వరుని ప్రకాశమువలన ప్రకాశించు జగత్కారణము (ప్రకృతి), జగద్రచనకు వలయు సామగ్రియు నంతయు నీశ్వరుని యధీనమున నుండును. (ఋతం) ఆ యనంత జ్ఞానమయసామర్థ్యముచేతనే సమస్త విద్యలకు నిధియైన వేదశాస్త్రములను ప్రకాశింపజేసెను. పూర్వోత్తర కల్పములందు నిట్లే వేదములను ప్రకాశింపజేయును. (సత్యం) సత్వరజ స్తమో గుణాత్మకమగు అవ్యక్తము,

అవ్యాకృతము, సత్తు. ప్రధానము, ప్రకృతి యనబడు స్థూల సూక్ష్మ జగత్తునకు కారణ పదార్థము (అధ్యజాయత) పూర్వకల్పమునందువలె కార్యరూపమున నుత్పన్నమైనది. (తతో రాత్ర్యజాయత) ఆ యీశ్వరుని సామర్థ్యముచేతనే ప్రళయానంతరమున వేయి చతుర్యుగముల ప్రమాణము గల రాత్రి యనబడునదియు (ప్రళయము) పూర్వకల్పమునందువలె నగును. ఋగ్వేదమున సృష్టికి పూర్వము ఆకాశమంతయు అంధకారరూపమున నుండును. ఆ యంధకారమున జగత్తునకు సంబంధించిన సర్వపదార్థములు, జీవులు కప్పబడియుండును. దీనినే మహారాత్రియందురు' అని యున్నది. (తతః సముద్రో అర్ణవః) అనంతరమున అతని సామర్థ్యమువలననే పృథివియందును మేఘమండలమునందును గల మహాసముద్రము పూర్వమువలె నుత్పన్నమగును. (సముద్రా దర్ణవా దధి సంవత్సరో అజాయత) 'సముద్రముత్పన్నమైన తదుపరి క్షణము, ముహూర్తము, యామము, సంవత్సరమునను పేర్లతో చెప్పబడు కాలము వ్యక్తమగును. వేదము మొదలు పృథివి వఱకుగల జగత్తంతయు నీశ్వరునిచే నిత్యసామర్థ్యము ప్రకాశితమగును. ఈశ్వరుడు సమస్తము నుత్పన్నము చేసి యన్నిటియందును వ్యాపకుడై అంతర్యామిరూపమున నెల్లరి పుణ్యపాపముల నెఱుగును. పక్షపాతమును విడిచి సత్యన్యాయముతో తగినట్లు ఫలము నిచ్చుచుండును. ఇట్లు నిశ్చితముగా తెలిసికొని మనుజులు పాపముల నెన్నడు చేయరాదు. అందువలననే ఈ మంత్రములు అఘమర్షణమంత్రములనబడును.

తదుపరి "శంనో దేవి" అను ఆచమన మంత్రమునుచ్చరించి మరల ముమ్మాఱు ఆచమనము చేయవలయును.

**ఓం శన్నో దేవీ రభిష్టయ, ఆపో భవంతు పీతయే,**

**శంయోరభిస్రవంతు నః(యజు. 36-12)**

## మనసా పరిక్రమ మంత్రములు

ఓం ప్రాచీ దిగగ్నిరధిపతిరసితో రక్షితాదిత్యా ఇషవః,
తేభ్యో నమోz ధిపతిభ్యో నమో రక్షితృభ్యోనమ
ఇషుభ్యో నమ ఏభ్యో అస్తు, యో z స్మాన్ ద్వేష్టి,
యం వయం ద్విష్మ స్తం వో జంభే దధ్మః

ఓం దక్షిణా దిగింద్రోzధిపతిస్తిరశ్చిరాజీ రక్షితా,
పితర ఇషవః, తేభ్యో నమోzధిపతిభ్యో నమో రక్షితృభ్యో
నమ ఇషుభ్యో నమ ఏభ్యో అస్తు, యో zస్మాన్ ద్వేష్టి,
యం వయం ద్విష్మ స్తం వో జంభే దధ్మః

ఓం ప్రతీచీ దిగ్వరుణోzధిపతిః పృదాకూ రక్షితాన్న మిషవః
తేభ్యో నమోzధిపతిభ్యో నమో రక్షితృభ్యో
నమ ఇషుభ్యో నమ ఏభ్యో అస్తు, యో zస్మాన్ ద్వేష్టి,
యం వయం ద్విష్మ స్తం వో జంభే దధ్మః

ఓం ఉదీచీ దిక్ సోమోzధిపతిః స్వజో రక్షితాశని రిషవః
తేభ్యో నమోzధిపతిభ్యో నమో రక్షితృభ్యోనమ
ఇషుభ్యో నమ ఏభ్యో అస్తు, యోzస్మాన్ ద్వేష్టి,
యం వయం ద్విష్మ స్తం వో జంభే దధ్మః

ఓం ధ్రువాదిగ్విష్ణురధిపతిః కల్మాషగ్రీవో రక్షితా
వీరుధ ఇషవః, తేభ్యో నమోzధిపతిభ్యో నమో రక్షితృభ్యో
నమ ఇషుభ్యో నమ ఏభ్యో అస్తు, యోzస్మాన్ ద్వేష్టి,
యం వయం ద్విష్మ స్తం వో జంభే దధ్మః

ఓం ఊర్ధ్వాదిగ్ బృహస్పతి రధిపతిః శ్విత్రో రక్షితా వర్షమిషవః,
తేభ్యో నమోzధిపతిభ్యో నమో రక్షితృభ్యోనమ
ఇషుభ్యో నమ ఏభ్యో అస్తు, యోzస్మాన్ ద్వేష్టి,
యం వయం ద్విష్మ స్తం వో జంభే దధ్మః (అధ. 3-27-1 నుండి 6 మం. వరకు)

ప్రాచీ దిక్ - అన్ని దిక్కులందును వ్యాపించియుండు పరమేశ్వరుని సంధ్యయందు అగ్ని ఆది నామములద్వారా ప్రార్థింపవలయును. ప్రాచీ దిక్కు - అనగా తూర్పు, సూర్యుడుదయించు దిక్కు ప్రాచీదిక్కే. దానికి అధిపతి అగ్ని - అనగా జ్ఞానస్వరూపుడగు పరమేశ్వరుడు. బంధనరహితుడైన యతడు మనకు సదా రక్షకుడగు గాక! ఎవరకి ఆదిత్యులు ప్రాణములో, కిరణములు బాణములో, వానిచే జగత్తు నెవరు రక్షింతురో అట్టి యింద్రియాధిపతులకు శరీర రక్షకులకు బాణరూపప్రాణములకు పలుమాఱులు నమస్కారములు, ఎవడు మమ్ముద్వేషించునో, మఱియు ఎవనిని మేము ద్వేషింతుమో ఉభయులము అనర్థములను వీడి పరస్పరము మిత్రులమగునట్లు భగవానుడు అనుగ్రహించుగాక!

దక్షిణా దిక్ - దక్షిణ దిక్కునకు ఇంద్రుడు పరమైశ్వర్యయుక్తుడగు పరమేశ్వరుడు అధిపతి. అతడు కృపతో మనకు రక్షకుడగు గాక....

ప్రతీచీ దిక్ - ప్రతీచికి - పడమరకు వరుణుడు - సర్వోత్తముడయిన పరమాత్ముడు అధిపతి. అతడు కృపతో మనకు రక్షకుడగుగాక....

ఉదీచీ దిక్ - ఉత్తరమునకు సర్వజగదుత్పాదకుడగు సోముడు అధిపతి. అట్టి యీశ్వరుడు మనకు రక్షకుడగుగాక!.......

ధ్రువా దిక్ - అధోదిక్కునకు విష్ణువు - వ్యాపకుడగు పరమేశ్వరుడు అధిపతి. అతడు రక్షకుడగుగాక!......

ఊర్ధ్వా దిక్ - ఆకాశాది, వేదశాస్త్రాది బృహత్తమములగు పదార్థముల కధిపతియైన పరమేశ్వరుడు ఊర్ధ్వదిక్కున కధిపతి. అతడు సర్వ విధముల మనకు రక్షకుడగు గాక!.....

ఎల్లరను సర్వశక్తిమంతుడు, సర్వగురువు, న్యాయకారియు, దయాలుడు, పితృవత్పాలకుడు నగు పరమేశ్వరునే అన్ని దిక్కులందును రక్షకునిగా భావింపవలయును.

## ఉపస్థాన మంత్రములు

**ఓం ఉద్వయం తమసస్పరి స్వః పశ్యన్త ఉత్తరమ్,**
**దేవం దేవత్రా సూర్యమగన్మ జ్యోతిరుత్తమమ్.** (యజు. 35-14)

ఓ పరమేశ్వర ! నీవు ప్రకాశస్వరూపుడవు; సర్వోత్తముడవు; దివ్యగుణ యుక్తుడవు, ఆనందదాతవు, నిత్యస్వరూపుడవగుటచే ప్రళయానంతరమున నుండువాడవు, సర్వానందస్వరూపుడవు, అజ్ఞానాంధకారమునకు వేఱుగానుండు నిన్ను చూచుచు శ్రద్ధావంతులమై నీ శరణుజొచ్చెదము.

**ఓం ఉదు త్యం జాతవేదసం దేవం వహన్తి కేతవః**
**దృశే విశ్వాయ సూర్యమ్.** (యజు. 33-31)

ఎవనినుండి ఋగ్వేదాది చతుర్వేదములు ప్రసిద్ధములయినవో, ఎవడు దేవదేవుడో, ఎవడు జగత్ప్రకాశకుడో, అట్టి పరమాత్ముని విశ్వవిద్యా ప్రాప్తికై యుపాసించుచున్నాము. వేదశ్రుతులు, జగద్రచనాదుల లోని నియామక గుణములు ఆ పరమేశ్వరునే బోధించుచున్నవి. విశ్వాత్ముడు, నంతర్యామియు నగు నా పరమాత్ముని తక్క అన్యుని ఉపాసింప జనదు.

**ఓం చిత్రం దేవానాముదగాదనీకం**
**చక్షుర్మిత్రస్య వరుణస్యాగ్నేః,**
**ఆప్రా ద్యావాపృథివీ అంతరిక్షగ్ం,**
**సూర్య ఆత్మా జగతస్తస్థుషశ్చ స్వాహా.** (యజు. 7-42)

చరాచర జగత్తునకు ఆత్మ సూర్యు డనబడును. అట్టి సూర్యుని ఇతర లోకలోకాంతరములను నిర్మించి ధరించి రక్షించువాడును, రాగద్వేష రహితుడగు మనుష్యుని, సూర్యలోకమును, ప్రాణమును ప్రకాశింపజేయు వాడును, ఉత్తమ కార్యముల నొనర్చుమానవుని ప్రాణాపానములను ప్రకాశింపజేయువాడును, విద్వాంసుల హృదయములందు సదా ప్రకాశించు వాడును, దుఃఖముల నాశ మొనర్చు పరమబలము నగు పరమేశ్వరుడు మా హృదయములందు ప్రకాశితుడై యుండుగాక!

**ఓం తచ్చక్షుర్దేవహితం పురస్తాచ్ఛుక్రముచ్చరత్;**
**పశ్యేమ శరదః శతమ్, జీవేమ శరదః శతగ్ం,**
**శృణుయామ శరదః శతం, ప్రబ్రవామ శరదః శతం**
**అదీనాః స్యామ శరదః శతం, భూయశ్చ శరదః శతాత్.** (యజు. 36-24)

సర్వద్రష్టయు, ధార్మిక విద్వాంసులకు పరమహిత కారకుడు, సర్వదా సత్యస్వరూపమున నుండువాడును, సృష్టికర్తయు నగు పరమాత్ముని నూఱు వత్సరములదనుక చూతుముగాక: జీవింతుము గాక; వింధుముగాక; ఆ బ్రహ్మనే యుపదేశింతుము గాక; అతని కృపవలన నెవరికిని మనము అధీనులము గాకుందుముగాక; నూఱువత్సరములకు పైబడియు నిట్లే జీవింతుముగాక:

పరమేశ్వరు డొక్కడే యెల్లరికి నుపాస్యుడు. అతనిని విడిచి అన్యము నుపాసించువాడు పశువు. వాడు దుఃఖముల ననుభవించును. కాబట్టి ప్రేమమున మగ్నులయి మనస్సును, ఆత్మను పరమాత్మతో జోడించి పై మంత్రములతో స్తుతి ప్రార్థనలు సదా చేయుచుండవలయును.

## గురుమంత్రము - గాయత్రి

**ఓం భూర్భువః స్వః త త్సవితుర్వరేణ్యమ్,**
**భర్గో దేవస్య, ధీమహి, ధియో యో నః ప్రచోదయాత్**

**(యజు. 36-3. ఋ. 3-62-10 సామ. 900 మం.)**

ఓమ్ (అ+ఉ+మ్) పరమేశ్వరుని నామములలో ఉత్తమ నామము. ఇందు ఇతర నామార్థములన్నియు నిమిడియున్నవి. అకారముచే విరాట్టు, అగ్ని, విశ్వము మున్నగు నామములు గ్రహింపబడును. వివిధమగు చరాచరజగత్తును ప్రకాశింపజేయుటచే పరమేశ్వరుడు విరా ట్టనబడును. వేదాది శాస్త్రముల ద్వారమునను, విద్వాంసులచేతను, పొందబడువాడు కాబట్టి అగ్ని అనబడును. అకాశాది భూతములన్నియు పరమేశ్వరునియం దిమిడి యుండుటచే నతడు విశ్వ మనబడును. ప్రకృత్యాది పదార్థములందు ప్రవిష్టుడై యుండుటచే విశ్వమనబడును.

ఉకారముచే హిరణ్యగర్భుడు, వాయువు, తైజసుడు మున్నగు నామముల గ్రహింపవలయును. హిరణ్యమనగా తేజస్సు, సూర్యుడు మున్నగు పదార్థములు. అవి గర్భమునందు కలవాడు కాబట్టి పరమేశ్వరుడు హిరణ్య గర్భుడు. సూర్యాది తేజస్సులకు అదిష్ఠానము - ఆధారము- అని తాత్పర్యము. అనంతబలు డగుటచే సర్వజగత్తును ధరించి యతడే వాయు వనబడును.

సూర్యాదులను ప్రకాశింపజేయుచు స్వయంప్రకాశమాను డగుటచే నీశ్వరుడు తైజసు డనబడును.

మకారముచే ఈశ్వరుడు, ఆదిత్యుడు, ప్రాజ్ఞుడు మున్నగు నామములు గ్రహింపబడును. సర్వశక్తిమంతుడగుటచే నీశ్వరుడు, అవినాశియగుటచే ఆదిత్యుడు, సకలజగత్తును బాగుగ నెఱుగుటచే ప్రజ్ఞుడు లేక ప్రాజ్ఞుడనని పరమేశ్వరుడు పిలువబడును. ఇట్టి నామార్థములను 'ఓమ్'చే గ్రహించి ధ్యానింపవలయును.

భూః (భూ రితి వై ప్రాణః) భూశబ్దముచే పరమేశ్వరుని సర్వప్రాణులను జీవింపజేయు ప్రాణమనియు, ప్రాణముకంటె ప్రియుడనియు తెలిసికొన వలయును.

భువః (భువ రి త్యపానః) ముముక్షువులకు, ముక్తులకు భగవద్భక్తులకు, ధర్మాత్ములకు దుఃఖములు తొలగించుటచే పరమాత్ముడు (భువః) అపానము అనబడును. (అపనయించుట - తొలగించుట, అపనయించువాడు కావున అపానము)

స్వః(స్వ రితి వ్యానః) ప్రాణాది సకల జగత్తునందును వ్యాపించి దానిని చేష్టింపజేయును. కాబట్టి పరమేశ్వరుడు (స్వః) వ్యాన మనబడునని తెలియునది.

'ఓమ్ భూ ర్భువః స్వః అను పదములలోనున్న గూఢార్థములను పైన వివరించినట్లు తెలిసికొని పరమేశ్వరుని చింతన చేయవలయును.

## మంత్రార్థము

**అర్థము** :- సవితుః-సకలజగత్తును సృష్టించు, దేవస్య-సమస్త విశ్వమును ప్రకాశింపజేయు పరమాత్ముని యొక్క, తత్ వరేణ్యం భర్గః-ఆ దివ్యమై శ్రేష్ఠమై యొప్పు నిర్గుణము, నిర్మలము, దోషరహితము నగు పరమార్థ విజ్ఞాన స్వరూపమును, ధీమహి-నిత్య ముపాసింతుము. యః-ఆపరమేశ్వరుడు, నః-మాయొక్క, ధియః-ధారణశక్తి గల బుద్ధులను, ప్రచోదయాత్-ప్రేరేపించును.

ఓ సచ్చిదానందానంతస్వరూప! ఓ నిత్య శుద్ధబుద్ధముక్తస్వభావ! ఓ నిరాకార! సర్వశక్తి మంతుడవగు నో న్యాయకారీ! ఓ కరుణామృతవారిధీ! నీ దివ్యము, వరేణ్యము నగు విజ్ఞానరూపమును మేము నిత్య ముపాసింతుము.

మాకు ధారణశక్తిగల బుద్ధి నిత్తువుగాక! మే మా బుద్ధి సహాయమున బ్రహ్మచర్యాది సద్వ్రతముల నాచరింతుముగాక! విద్యాజ్ఞానాదులను పొంది పరమసుఖముల నొందుదుము గాక!

ఇట్టి యర్థమును పురస్కరించుకొని నిత్యము ప్రాతః సాయం సంధ్యలలో నేకాంతదేశమున పరమేశ్వరుని ధ్యానింపవలయును.

## సమర్పణము

హే జగదీశ్వర! దయానిధే! భవత్ కృపయా, అనేన జపోపాసనాది కర్మణా, ధర్మార్థకామమోక్షాణాం సద్యః సిద్ధిః భవే న్నః

ఓ పరమేశ్వర! దయానిధే! నీ కృపవలన మేము చేసిన యీజప ఉపాసనాది కర్మముల ద్వారమున ధర్మార్థ కామ మోక్షములు మాకు వెంటనే సిద్ధించును గాక!

## నమస్కార మంత్రము

**ఓం నమః శంభవాయ చ, మయోభవాయ చ**
**నమః శంకరాయ చ, మయస్కరాయ చ**
**నమః శివాయ చ, శివతరాయ చ (య.అ. 16. మం. 41)**

సుఖ స్వరూపుడగు పరమేశ్వరునకు నమస్కారము. సర్వోత్తమ సుఖప్రదాతయగు నీశ్వరునకు నమస్కారము. కల్యాణకారకుడగు దేవునకు నమస్కారము. స్వభక్తులను సుఖకరకార్యములలో నియుక్తము చేయు భగవంతునకు నమస్కారము. మంగళ స్వరూపునకు, మోక్షసుఖ ప్రదాతకు నమస్కారములు.

**ఓం శాంతిః శాంతిః శాంతిః**

సంధ్యోపాసనావిధి సమాప్తము

# దేవయజ్ఞము - అగ్ని హోత్రము

సంధ్యోపాసన చేసిన తదుపరి అగ్నిహోత్రము చేయవలయును. అందుల కొక అగ్నికుండమును చేయించుకొనవలయును. అది మట్టి, ఇనుము, రాగి, వెండి, బంగారము వీనిలో దేనితోనైనను చేయించుకొనవచ్చును. దాని పరిమాణము: 16అం, పొడవు. 16 అం, వెడల్పు.16 అం. లోతు. క్రిందిభాగము 4 అం. పొడవు, వెడల్పులు కలిగి యుండును. 16అం. పొడవైన కాడగల గరిటె యొకటి యుండవలయును. పైన జెప్పిన ధాతువులతో గాని, మోదుగ కట్టెతోగాని గరిటె చేయించుకొనవలయును. జలపాత్ర యొకటి యుండవలయును. మోదుగ, మామిడిపుల్లలు సమిధలకై యుపయోగింప వలయును. ఒక శేరు (80 తులములు) నేతితో ఒక్క రతి కస్తూరి, ఒక్క మాష తూనికగల కుంకమ పువ్వునూరి కలిపి యుంచుకొనవలయును. దానినుండి నిత్యము ఒక ఛటాకు (5తు.) కాని, అంతకు కొంచె మించుమించుగా కాని నేయి వేఱుగా పాత్రమున తీసికొని అగ్నిహోత్రమున కుపక్రమింపవలయును.

అగ్నిహోత్రమును ప్రారంభించుటకు ముందుగా నీ క్రింది మంత్రములతో భగవంతుని స్తుతి ప్రార్థ నోపాసనల నొనర్చవలయును.

## స్తుతి ప్రార్థనోపాసనా మంత్రములు

**ఓం విశ్వాని దేవ సవితర్దురితాని పరా సువ**
**యద్భద్రం తన్న ఆ సువ. (యజు 30-3)**

**అర్థము:** సవితః దేవ! - జగదుత్పాదకుడవగు నో దేవ! విశ్వాని - సమస్తములైన, దురితాని - పాపములను, పరాసువ - దూరమొనర్పుము, యద్ భద్రం - ఏది శుభమో, తత్ - అది, నః ఆసువ - మా కిమ్ము

**ఓం హిరణ్యగర్భః సమవర్తతాగ్రే**
**భూతస్య జాతః పతిరేక ఆసీత్**
**స దాధార పృథివీం ద్యాముతేమాం**
**కస్మై దేవాయ హవిషా విధేమ. (య. 13 -4)**

**అర్థము :** హిరణ్యగర్భః - సూర్యాది జ్యోతిస్సులు గర్భమున గల

యీశ్వరుడు, అగ్రే - సృష్టికి పూర్వమున, సమవర్తత - ఉండెను. జాతః - ప్రసిద్ధుడైన ఆ దేవుడు, భూతస్య - ప్రపంచమునకు, ఏకః పతిః - ఒకడే స్వామి, ఆసీత్ - ఐ యుండెను, సః-అతడు, పృథివీం - భూమిని, ఉతేమాం ద్యాం - మఱియు నీ దివమును, దాధార - ధరించియున్నాడు, కస్మై - సుఖస్వరూపుడైన, దేవాయ - ఆ దేవునకు. హవిషా - భక్తితో, విధేమ - నమస్కరింతుము.

**ఓం యఆత్మదా బలదా, యస్య విశ్వ ఉపాసతే**
**ప్రశిషం, యస్య దేవాః**
**యస్య ఛాయామృతం యస్య మృత్యుః**
**కస్మై దేవాయ హవిషా విధేమ.** (య. 25-13)

**అర్థము:** యః - ఎవడు, ఆత్మదా - శరీరాదుల నిచ్చునో, బలదా - బలము నిచ్చునో, విశ్వే - అందఱు, యస్య - ఎవనిని, ఉపాసతే - ఉపాసించుచున్నారో, దేవాః - విద్వాంసులు, యస్య - ఎవనియొక్క, ప్రశిషం - ఆజ్ఞను పాలింతురో, యస్యఛాయా -ఎవని యాశ్రయము, అమృతమ్ - మోక్షదాయకమో, యస్య - ఎవని యనాశ్రయము, మృత్యుః - మరణదాయకమో, కస్మై విధేమ - ఆ సుఖస్వరూప దేవునకు భక్తితో నమస్కారము.

**ఓం యః ప్రాణతో నిమిషతో మహిత్వైక**
**ఇద్రాజా జగతో బభూవ**
**య ఈశే అస్య ద్విపద శ్చతుష్పదః**
**కస్మై దేవాయ హవిషా విధేమ.** (యజు. 23-3)

**అర్థము:** యః-ఎవడు, మహిత్వా - మహిమతో, ఏకః ఇత్ - ఒక్కడే, ప్రాణతః- ప్రాణము గల్గినట్టియు, నిమిషతః-ప్రాణము లేనట్టియు, జగతః- జగత్తునకు, రాజా బభూవ-ప్రకాశకుడో, యః-ఎవడు, ద్విపదః -రెండు పాదములు గలవానికి. చతుష్పదః- చతుష్పాత్తులకు, ఈశే-స్వామియో, కస్మై విధేమ - ఆ సుఖరూపుడగు దేవునకు నమస్కారము.

**ఓం యేన ద్యౌరుగ్రా పృథివీ చ దృఢా**
**యేన స్వ స్తభితం యేన నాకః**

**యో అంతరిక్షే రజసో విమానః**

**కస్మై దేవాయ హవిషా విధేమ.** (యజు.32-6)

**అర్థము:** యేన - ఎవనిచే, ఉగ్రా ద్యౌః - ప్రకాశయుక్త దివము, పృథివీ చ - భూమియు, దృఢా - దృఢముగా నుంచబడినవో. యేన - ఎవనిచే-స్వః - స్వర్గము, స్తభితం - ధరింపబడినదో, యేన - ఎవనిచే, నాకః-మోక్ష మొసగబడునో, యః -ఎవడు, అంతరిక్షే - అంతరాళమున, రజసః- లోకములను, విమానః -నిర్మించునో, కస్మైవిధేమ - ఆ సుఖస్వరూపు డగు దేవునకు భక్తితో నమస్కారము.

**ఓం ప్రజాపతే! న త్వదేతాన్యన్యో**

**విశ్వా జాతాని పరి తా బభూవ**

**యత్కామాస్తే జుహుమస్తన్నో అస్తు**

**వయం స్యామ పతయో రయీణామ్** (ఋ. 10-121-10.)

**అర్థము:** ప్రజాపతే :- ఓ జీవేశ్వర!. త్వత్ - నీకంటె, అన్యః-ఇతరుడు, తా ఏతాని - ఆయీ, జాతాని - ఉత్పన్నములైన పదార్థములను, న పరిబభూవ - వశము చేసికొనలేడు. యత్ కామాః- ఏ కోరికలతో మేము, తే జుహుమః - నిన్ను భజింతుమో, తన్నో అస్తు - అవి మాకు సిద్ధించుగాక, వయమ్ - మేము, రయీణాం - ధనములకు, పతయః-స్వాములము. స్యామ - అగుదుము గాక!

**ఓం స నో బంధుర్జనితా స విధాతా**

**ధామాని వేద భువనాని విశ్వా**

**యత్ర దేవా అమృతమానశానా**

**స్తృతీయే ధామన్నధ్యైరయన్త.** (యజు. 32--10)

**అర్థము:** సః అతడు, నః - మనకు, బంధుః - బంధువు, జనితా - ఉత్పాదకుడు, సః - అతడే, విధాతా - నిర్మించువాడు, విశ్వా - సంపూర్ణ, ధామాని - స్థానములను, భువనాని - లోకములను, వేద - ఎఱుగును, యత్ర - ఎవనిలో, అమృతం - మోక్షము, ఆనశానాః - అనుభవించుచు, దేవాః -

ముక్తులు, తృతీయే - మూడవ, ధామన్ - ధామమున, అధ్యైరయన్త - విచరింతురో, వానికి నమస్సులు.

**ఓం అగ్నే! నయ సుపథా రాయే అస్మాన్**
**విశ్వాని దేవ వయునాని విద్వాన్**
**యుయోధ్యస్మజ్జుహురాణమేనో**
**భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ.** (యజు. 40-16)

**అర్థము:** అగ్నే:- ప్రకాశక ప్రభూ! అస్మాన్ - మమ్ములను, రాయే - ధన ప్రాప్తికి, సుపథా - మంచి మార్గమున, నయ - నడపుము, దేవ: - దేవ: విశ్వాని - సమస్త, వయునాని - కర్మలు, విద్వాన్ - నీ వెఱుగుదువు, అస్మత్ - మానుండి, జుహురాణం - కుటిలమైన, ఏనః - పాపమును, యుయోధి - వేఱుచేయుము, తే - నీకు, భూయిష్ఠాం - ఎక్కువగ, నమఉక్తిం - నమస్కారము, విధేమ - చేయుదుము.

## స్వస్తి వాచనము

**ఓం అగ్నిమీళే పురోహితమ్, యజ్ఞస్య దేవమృత్విజమ్,**
**హోతారం రత్నధాతమమ్.** ( ఋ. 1-1-1.) 1

అగ్నిం - ప్రకాశస్వరూపుడు, పురోహితం - ముందుగా హిత మొనర్చు వాడు, యజ్ఞస్య దేవమ్ - సృష్టి స్థితి లయము లనెడి యజ్ఞమును జేయు దేవుడు, ఋత్విజం - ఋతువుల క్రమము ననుసరించి ఫలముల నొసంగువాడు, హోతారం - జీవులకు కర్మఫలములను శరీరాది రూపమున నొసంగువాడు, రత్నధాతమం - రమణీయములగు రత్నముల కధిష్ఠానమునగు పరమేశ్వరుని ఈళే - స్తుతియింతును.

ఉపాసకుడు ( ఓమ్) రక్షకుడగు పరమేశ్వరునిట్లు స్వస్తి (శుభము) కొఱకు స్తుతింపవలయును. పరమేశ్వరుడగ్ని - స్వయంప్రకాశ స్వరూపుడు - జ్ఞానస్వరూపుడు. సృష్టికి ముందుగా నుండి దాని నడపువాడు. జీవులకు హితము చేయువాడు. అతడు సృష్టిస్థితిలయరూప యజ్ఞము నొనర్చుచుండును. ఋతుభేదములను గలిగించి విభిన్నఫలముల నందజేయును. కర్మఫలములను జీవులకు యథాతథముగ నొసంగును. పృథివ్యాది పదార్థములందు రమణీయ

రత్నముల నుంచును.

సర్వప్రాణులకు శుభము నొసంగు పరమేశ్వరుని నిత్యము స్వస్తి వాచన మంత్రములతో స్తుతి నొనరించుచుండవలయును.

**ఓం స నః పితేవ సూనవేzగ్నే సూపాయనో భవ**

**సచస్వా నః స్వస్తయే.** (ఋ. 1-1-9)2

అగ్నే - ప్రకాశ స్వరూప పరమేశ్వర! సూనవే - పుత్రునికొఱకు, పితా ఇవ - తండ్రివలె, సః - ఆ నీవు, నః - మా కొఱకు, సూపాయనః- సులభుడవు - మంచి సాధనములు కలవాడవు, భవ - అగుము, నః స్వస్తయే - మాకు శుభము కలుగుటకై, ఆ సచస్వ - ప్రార్థన నాలింపుము.

ప్రకాశస్వరూప ప్రభూ! తండ్రి తన సంతానమునకు సదా సులభు డగునట్లు నీవు మాకు సులభప్రాప్యుడ వగుము. మాకు శుభము కలుగునట్లు సాధనముల జేకూర్చుము. మా ప్రార్థనల నాలించి సత్పథమున నడపుము.

**ఓం స్వస్తినో మిమీతామశ్వినా భగః**

**స్వస్తి దేవ్యదితిరనర్వణః**

**స్వస్తి పూషా అసురో దధాతు నః**

**స్వస్తి ద్యావాపృథివీ సుచేతునా.** (ఋ. 5–51-11.) 3

అశ్వినా - సూర్యచంద్రులు, ఉపదేశకాధ్యాపకులు, నః - మాకు, స్వస్తి - శుభము, మిమీతామ్ - చేకూర్తురుగాక! భగః - ఐశ్వర్యము, స్వస్తి - శుభంకర మగుగాక! దేవీ - దివ్యగుణములు గల, అదితిః - అఖండనీయ వేదమాత, అనర్వణః - నిశ్చలమై, స్వస్తి - శుభము నిచ్చుగాక! అసురః - ప్రాణదానము చేయు, పూషా - మేఘము, నః - మాకు, స్వస్తి - శుభము, దధాతు - ధరించుగాక! ద్యావా పృథివీ - ద్యు, భూలోకములు, సుచేతునా - మంచి చైతన్యము నొసంగి, స్వస్తి - శుభము నిచ్చుగాక!

ఓ పరమేశ్వర! వ్యాపకబుద్ధిగల ఉపదేశకులు, అధ్యాపకులు, మాకు శుభముల నొనగూర్తురుగాక! సూర్యచంద్రులు, ప్రాణాపానములు కూడ శుభముల నిచ్చుగాక! ఐశ్వర్యము, వేదమాత శుభసాధకము లగు గాక ! మేఘములు

జీవనదాన మొనర్చుగాక! భూలోకము, ద్యులోకము మాకు జ్ఞాన సాధనములై శుభము నిచ్చుగాక!

**ఓం స్వస్తయే వాయు ముపబ్రవామహై**
**సోమం స్వస్తి భువనస్య యస్పతిః**
**బృహస్పతిం సర్వగణం స్వస్తయే**
**స్వస్తయ ఆదిత్యాసో భవంతు నః** (ఋ. 5-51-12,)4

యః-ఎవడు, భువనస్య పతిః - జగదీశ్వరుడో, (అట్టి) వాయుః-జగత్తునకు గతినిచ్చు పరమేశ్వరుని, సోమం - శాంతిదాయకుని, స్వస్తయే-శుభము కొఱకు, ఉపబ్రవామహై - స్మరింతుముగాక! (అతడు) స్వస్తి - శుభంకరుడగు గాక! సర్వగణం - సమస్త జీవగణములు తనయందుగల, బృహస్పతిం - గొప్పవాని కన్నింటికి స్వామి యగు పరమేశ్వరుని, ఉపబ్రవామహై - కీర్తింతుముగాక! ఆదిత్యాసః - దివ్యశక్తులు - ద్వాదశ మాసములు, నః - మాకు, స్వస్తయే - శుభముకొఱకు, భవంతు - అగుగాక!

పరమేశ్వరుడు భువనపతి, అత డీ జగత్తునకు గతి ప్రదాత, శాంతిదాత బ్రహ్మాండమున గల గొప్పవియగు సూర్యాది దేవతల కన్నింటికి నతడు పతి - పాలకుడు - స్వామి. సమస్త భూతగణముల కాధారము. అతనిని శుభము లర్థించి ప్రార్థింతుము. కీర్తింతుము. అతడు, అతని దివ్యశక్తులు మనకు శుభము నొడగూర్చుగాక!

**ఓం విశ్వే దేవా నో అద్యా స్వస్తయే**
**వైశ్వానరో వసురగ్నిః స్వస్తయే**
**దేవా అవన్తు ఋభవః స్వస్తయే**
స్వస్తి నో రుద్రః **పాత్వంహసః** (ఋ. 5-51-13.)5

విశ్వేదేవాః - ఎల్ల విద్వాంసులు, దివ్యశక్తులు, అద్య - వర్తమాన కాలమున, నః-మాకు, స్వస్తయే - శుభకరము లగు గాక! వైశ్వానరః - విశ్వనాయకుడు, వసుః- సమస్తమును వసింపజేయువాడు, అగ్నిః - ప్రకాశ స్వరూపుడునగు పరమేశ్వరుడు, స్వస్తయే - శుభప్రదుడగుగాక ! దేవాః -

విద్వాంసులు, అవంతు-రక్షింతురుగాక! ఋభవః-అగ్ని వాయ్వాది దేవతలు వైజ్ఞానిక విద్వాంసులు, స్వస్తయే - శుభమున కగుదురు గాక! రుద్రః - దుష్టులను దండించి యేడ్పించు పరమేశ్వరుడు, నః-మమ్ములను, అంహసః - పాపమునుండి తొలగించి, పాతు - రక్షించుగాక, స్వస్తి - శుభమునిచ్చుగాక!

**ఓం స్వస్తి మిత్రావరుణా, స్వస్తి పథ్యే రేవతి,**
**స్వస్తి న ఇంద్రశ్చాగ్నిశ్చ, స్వస్తి నో అదితే కృధి. 6** (ఋ. 5-51-14)

మిత్రావరుణా - ప్రాణాపానములు, స్వస్తి - శుభకరములగుగాక! పథ్యే - శుభముల నొసంగు, రేవతి - ఐశ్వర్యవంతుడవగు నో దేవ! స్వస్తి - శుభము నొసగుము. ఇంద్రః చ, అగ్నిః చ - విద్యుత్తు. అగ్ని రెండును, నః - మాకు, స్వస్తి - శుభములగుగాక! అదితే - అఖండపరమేశ్వర! నః - మాకు, స్వస్తి - శుభము, కృధి - చేయుము.

ఓ సర్వేశ్వర! మా శరీరమునగల ప్రాణాపానాది వాయువులు మాకు హాని కలిగింపకుండునుగాక! అట్లే సుషుమ్నాది మార్గమున విఘ్నములు కలుగకుండును గాక! ధనధాన్యములందు మాకు కొఱత కలుగకుండుగాక ! విద్యుత్తు, అగ్నిరెండును మాకు శుభములు చేకూర్చుటకు సాధనములగుగాక! ప్రభూ! నీ వఖండుడవు. మాకు శుభము నిమ్ము.

**ఓం స్వస్తి పంథా మనుచరేమ సూర్యాచంద్రమసావివ**
**పునర్దదతాఘ్నతా జానతా సంగమేమహి.** (ఋ. 5-51-15)

సూర్యాచంద్రమసౌ ఇవ - సూర్యచంద్రులవలె, స్వస్తి పంథా - శుభ మార్గమును, అనుచరేమ - అనుసరింతుముగాక! పునః- మాటిమాటికి, దదతా - దానమొనర్చుచు, అఘ్నతా - హింసచేయక, జానతా - ఎఱుగుచు, సంగమేమహి - సాంగత్యము చేయుదుము.

ఓ దేవ! సూర్యచంద్రులవలె మేము ఉన్నతమార్గము ననుసరింతుము గాక! పలుమాఱు దానము చేయుదుము గాక! అహింసకులమై జ్ఞానుల సాంగత్యము చేయునట్లు అనుగ్రహింపుము.

**ఓం యే దేవానాం యజ్ఞియా యజ్ఞియానామ్**
**మనోర్యజత్రా అమృతా ఋతజ్ఞాః**

**తే నో రాసంతామురుగాయమద్య**

**యూయం పాత స్వస్తిభిః సదా నః** (ఋ. 7-35-15)8

యే-ఎవరు, దేవానాం - విద్వాంసులలో, యజ్ఞియాః - యజ్ఞము చేయు శీలము గలవారో, యజ్ఞియానాం - ఆ యాజ్ఞికులందును, (ఎవరు) మనోః యజత్రాః-మానవులలో పూజ్యులో, అమృతాః - అమరులో - జీవన్ముక్తులో, ఋతజ్ఞా ః- ప్రాకృతిక నియమజ్ఞులో - సత్యపరాయణులో, తే - వారు, అద్య - ఇప్పుడు, నః - మాకు, ఉరుగాయం - ప్రశంసింపదగు యశస్సును, రాసంతామ్ - ప్రదానము చేయుదురుగాక! - చేకూర్తురుగాక! యూయం - మీరు, సదా - ఎల్లప్పుడు, స్వస్తిభిః - శుభములతో, నః- మమ్ములను: పాత - రక్షింతురుగాక

యజ్ఞాది సత్కర్మములనొనర్చు విద్వాంసులు, మానవులచే పూజింపబడు జీవన్ముక్తులు, సత్యప్రకాశకులు నగు నుత్తమ మానవులు మా కెల్లప్పుడు యశస్సును చేకూర్తురుగాక! ఉపర్యుక్త సద్గుణ సంపన్నులయిన విద్వాంసులారా! మాకు శుభములను జేకూర్చి మమ్ము సదా కాపాడుదురు గాక!

ఓం **యేభ్యో మాతా మధుమత్పిన్వతే పయః**

**పీయూషం ద్యౌరదితిరద్రిబర్హాః**

**ఉక్థశుష్మాన్ వృషభరాన్ స్వప్నసస్తా**

**ఆదిత్యా అను మదా స్వస్తయే.** (ఋ. 10-63-3.) 9

మాతా - జనని, యేభ్యః - ఎవరికొఱకు, మధుమత్ - తియ్యని, పయః - పాలు, పిన్వతే - పిండునో, అద్రిబర్హాః - మేఘములతో నిండిన, అదితిః - అఖండమగు, ద్యౌః - ద్యులోకము, పీయూషం - అమృతవర్షము నిచ్చునో, ఉక్థశుష్మాన్ - బలవంతులు, వృషభరాన్ - కర్మనిష్ఠులు, స్వప్నసః - శుభకర్మాచరణపరులు, తాన్ ఆదిత్యాన్ - ఆ యాదిత్య బ్రహ్మచారులను, స్వస్తయే - శుభముకొఱకు, అ అనుమద - అనుసరింపుము - వారిని ప్రశంసింపుము.

"ఓ మానవులారా! నైష్ఠిక బ్రహ్మచారులకు జననీ జన్మభూములు తియ్యనిపాలు మధురపదార్థముల నొసంగి కాపాడును. అట్లే దివము కూడ

కమ్మని పానీయములను వర్షించి వారిని వర్ధిల్లచేయును. కావున మిక్కిలి బలశాలులు, శుభకర్మాచరణపరులునగు నా ఆదిత్య బ్రహ్మచారుల ననుసరించి శుభములను బొందుడు" అను నీ వేదాజ్ఞను పరిపాలించుశక్తి నొసంగి, యో దేవ! మమ్ములను కాపాడుదువుగాక!

**ఓం నృచక్షసో అనిమిషన్తో అర్హణా**
**బృహద్దేవాసో అమృతత్వమానశుః**
**జ్యోతీరథా అహిమాయా అనాగసో**
**దివో వర్ష్మాణం వసతే స్వస్తయే.** (ఋ. 10-63-4)10

నృచక్షసః - మానవకార్యముల నిరీక్షించువారు, అనిమిషంతః ఎల్లపుడు జాగరూకులై యుండువారు. అర్హణాః - పూజ్యులు, బృహద్దేవానః - గొప్ప విద్వాంసులు, అమృతత్వం - అమరత్వమును - మోక్షమును,ఆనశుః - పొందుదురు, జ్యోతీరథాః - జ్ఞానమార్గగాములు, అహిమాయాః - జ్ఞానధనులు, అనాగసః - నిరపరాధులు నగువారు, స్వస్తయే - సుఖప్రాప్తి కై, దివః - దివముయొక్క, వర్ష్మాణం - ఉన్నత స్థానమున, వసతే - వసింతురు.

లోకమున మానవులయు నేతలయు కార్యములను నిరీక్షించుచు నా విషయమునందు అప్రమత్తులై కీర్తిని సంపాదించిన వ్యక్తులు - దేశ భక్తులు విద్వాంసులు అమరులు నగుదురు.

జ్ఞానమార్గము ననుసరించు జ్ఞానధనులు పాపములకు దూరులై లోక కల్యాణము నొనర్చుచు నున్నతపదమున ప్రతిష్ఠితు లగుదురు. కావున నట్టివారి ననుసరించు బుద్ధిని ప్రసాదించునట్లు భగవానుని నిత్యము ప్రార్థింపవలయును.

**ఓం సమ్రాజో యే సువృధో యజ్ఞమాయయు**
**రపరిహ్వృతా దధిరే దివి క్షయమ్**
**తాం ఆ వివాస నమసా సువృక్తిభి**
**ర్మహో ఆదిత్యా అదితిం స్వస్తయే** (ఋ. 10-63-5)11

యే - ఎవరు, సమ్రాజః - చక్రవర్తి తుల్యులో, సువృధః - వృద్ధిని బొంది ఇతరుల నున్నతుల నొనర్తురో, యజ్ఞం - ఉత్తమ కార్యమును – యజ్ఞమును,

ఆయయుః - బాగుగ జేయుదురో; అపరిహ్వృతాః - కుటిలతను విడిచి ఋజు మార్గమున వర్తించుచు, దివి క్షయం - ఉన్నత పదమును బొందుదురో, తాన్ - ఆ, మహః ఆదిత్యాన్ - గొప్ప ఆదిత్య బ్రహ్మచారులను, సువృక్తిభిః - మంచివాక్కులతోను, నమసా - నమస్కారముతోను, ఆవివాస - బాగుగ సత్కరింపుము, స్వస్తయే - శుభప్రాప్తికై, అదితిం - అఖండ వేదవిద్యను సేవింపుము.

నైష్ఠిక (ఆదిత్య) బ్రహ్మచారులు చక్రవర్తులవలె సమ్మానింపదగిన వారు. వారు పరోపకార కృత్యముల నాచరింతురు. తమ యున్నతికై యత్నించుటయే గాక పరులయున్నతికై పాటుపడుదురు. వారు కపటులు కారు. ఋజువర్తను లగుదురు. అందువలన మానవులలో నున్నత స్థానము నలంకరింతురు. ప్రశంసాపాత్రు లగుదురు. అట్టి త్యాగధనులయిన ఆదిత్య బ్రహ్మచారుల నాదరింపుము, సేవింపుము. ఉత్తమ వాక్యములతో వారిని ప్రశంసింపుము. నమ్రభావముతో వారికి వందనము చేయుము. సదా వేద విద్య నభ్యసించి శుభములను బొందుము. ఇట్టి బుద్ధిని ప్రసాదించుటకై యీ మంత్రముతో భగవంతుని నిత్య మారాధింపుము.

**ఓం కో వః స్తోమం రాధతి యం జుజోషథ**
**విశ్వే దేవాసో మనుషో యతిష్ఠన**
**కో వో zధ్వరం తువిజాతా అరం కర**
**ద్యో నః పర్షదత్యంహః స్వస్తయే. (ఋ 10-63-6) 12**

మనుషః విశ్వేదేవాసః - మననముచేయు విద్వాంసులారా! కః - సుఖ స్వరూపుడగు పరమేశ్వరుడు, వః - మీ కొఱకు, స్తోమం - స్తుతి సమూహమును, రాధతి - సిద్ధము చేయును - నిర్మించును, యమ్ - ఆస్తోమమును, (మీరు) జుజోషథ - ప్రేమింతురు, తువిజాతాః - అనేక జన్మలనెత్తు నో మానవులారా! యతిష్ఠన - మీరెందఱున్నను, కః - అ సుఖస్వరూపుడే, వః - మీ కొఱకు, అధ్వరం - హింసారహిత యజ్ఞమును, అరంకరత్ - పూర్ణమొనర్చును. యః - ఆ యజ్ఞము, అతి అంహః - పాపమునుండి తప్పించి, స్వస్తయే - శుభముకొఱకు, నః - మనలను, పర్షత్ - తరింపజేయును - దాట వేయును.

మానవస్వభావముగల విద్వాంసులారా! పరమేశ్వరుడే స్తోత్రములను నిర్మించియున్నాడు. వానితో మీరు దేవుని స్తుతియించి కామముల నందుదురు. ఆ సుఖ స్వరూపుడగు దేవుడే హింసారహితమగు (అధ్వరము) యజ్ఞమును మీకు శుభములు చేకూర్చుటకు వేదమున వర్ణించియున్నాడు. అట్టి క్రతువుల నొనర్చి పాపముల నంటక జన్మబంధమును తరింతురు. నానావిధ జన్మములకు లోనగు జీవులు పరమేశ్వరుని స్తుత్యుపాసనల నొనర్చి నిష్కామభావముతో నహింసాత్మకములగు క్రతువుల నొనర్చి జన్మబంధమునుండి ముక్తులగుదురు.

ఓం యేభ్యో హోత్రాం ప్రథమామాయేజే మనుః
సమిద్ధాగ్నిర్మనసా సప్త హోతృభిః
**త ఆదిత్యా అభయం శర్మ యచ్ఛత**
**సుగా నః కర్త సుపథా స్వస్తయే.** (ఋ. 10-63-7)13

సమిద్ధాగ్నిః మనుః - ప్రకాశయుక్తతత్త్వములను సృష్టించు సర్వజ్ఞుడగు పరమేశ్వరుడు, యేభ్యః - ఎవరికొఱకు, హోత్రాం - హోమము (జ్ఞాన కర్మ రూపయజ్ఞము) ను - శరీరమును, ప్రథమాం - ముఖ్యముగా, మనసా - మనస్సుతో బాటు, సప్తహోతృభిః - ముఖాది సప్తహోతలతో, ఆయేజే - యోచించి నిర్మించెనో, ఆదిత్యాః - ఓ యమృత పుత్రులారా! తే - అట్టి మీరు, అభయం శర్మ - భయరహిత సుఖమును, నః - మాకు, యచ్ఛత - ఇండు - ప్రదానము చేయుడు, స్వస్తయే - శుభప్రాప్తికొఱకు, సుపథా - మంచి మార్గమును - శోభనవైదిక మార్గమును, నః మాకు, సుగాః-సుగమము, కర్త - చేయుడు.

పరమేశ్వరుడు అగ్ని సూర్య విద్యుదాది తత్త్వములను ప్రకాశవంతము లుగ జేయును. అతడే జ్ఞానము, కర్మ, ఉపాసనారూప యజ్ఞమును బోధించి యున్నాడు. ఆ యజ్ఞము నొనర్ప సాధనములుగ ముఖాది సప్తాంగముల ( 2 కన్నులు, 2 నాసికా పుటములు, 2 చెవులు 1 ముఖము) తో శరీరమును సృష్టించియున్నాడు. వీనితో బాటు మనస్సు నిచ్చియున్నాడు. ఈ శరీరముతో జ్ఞానకర్మోపాసనారూప యజ్ఞము నొనర్చువారు మానవ సమాజమునకు భయరహిత సుఖమును ప్రసాదింపగలరు. ఓ విద్వాంసులార! భగవన్నిర్మితమగు

నీ మానవశరీరముతో జ్ఞానాదిరూప యజ్ఞము నొనర్చుటకు వేదమార్గమును సుగమము చేయుడు. అప్పుడే లోకమునకు శుభము చేకూరును. అట్టి బుద్ధి నొసంగుటకు పరమేశ్వరుని నిత్యము ప్రార్థింపవలయునని భావము.

**ఓం యఈశిరే భువనస్య ప్రచేతసో**
**విశ్వస్య స్థాతుర్జగతశ్చ మంతవః**
**తే నః కృతాదకృతాదేనసస్పర్యద్యా**
**దేవాసః పిప్పృతా స్వస్తయే.** (ఋ. 10-63-8)14

విశ్వస్య భువనస్య - సంపూర్ణ ప్రపంచముయొక్క, స్థాతుః జగతః చ - అచరము, చరమునగు జగత్తును, మంతవః - విచారించి తెలిసికొనగల, ప్రచేతసః - గొప్ప విద్వాంసులు, యే - ఎవరు, ఈశిరే - శాసింతురో, తే - అట్టి మీరు, నః - మమ్ములను, కృతాత్ - కాయికము, అకృతాత్ - మానసికము నగు, ఏనసః పాపమునుండి, పరి - అన్నివైపులనుండి, అద్య - నేడు, అపిప్పృత - దూరము చేయుడు, దేవాసః - ఓ విద్వాంసులారా! స్వస్తయే - మా శుభముకొఱకు తోడ్పడుడు.

మననశీలురగు నుత్తమ విద్వాంసులే యీ లోకమును శాసింపగలరు. మానవసమాజమును నడపగలరు. అట్టి యోగ్యత కలిగిన విద్వాంసులారా! మీరు మమ్ములను కాయిక మానసిక పాపములనుండి తప్పించి, కాపాడి శుభము చేకూర్చుడు.

**ఓం భరేష్వింద్రం సుహవం హవామహే**
**అంహోముచం సుకృతం దైవ్యం జనమ్**
**అగ్నిం మిత్రం వరుణం సాతయే భగం**
**ద్యావాపృథివీ మరుతః స్వస్తయే.** (ఋ. 10-63-9)15

భరేషు - జీవనసంఘర్షలందు, సుహవం - ఆహ్వానయోగ్యుడగు, ఇంద్రం - పవిత్ర పరమేశ్వరుని, హవామహే - పిలుతుము, స్వస్తయే - శుభముకొఱకు, అంహోముచం - పాపమోచనుని, సుకృతం - పుణ్యమొనర్చు వానిని పిలుతుము. సాతయే - అన్నాదుల ప్రాప్తికొఱకు, దైవ్యం - అద్భుత

ప్రతిభావంతుని, జనం - ఉత్పాదకశక్తి సంపన్నుని, పిలుతుము, (ఇట్లే) మిత్రం - సర్వజ్ఞుని, వరుణం - జలవిజ్ఞానిని, అగ్నిం - అగ్రగామిని, భగం - ఐశ్వర్యవంతుని, ద్యావా పృథివీ - ఆకాశీయ, పార్థివ, మరుతః - ప్రాణవిద్యల నెఱుగువానిని, హవామహే - ఆహ్వానింతుము.

సంకట సమయములందు సహాయార్థము పరమేశ్వరుని పిలుతుము. పాపములనుండి మనలను దూరముగ నుంచుటకు పుణ్యవంతులను, బుద్ధిని సంపాదించుటకు బుద్ధిమంతులను, భక్తి మార్గమును బోధించుటకు భగవద్ భక్తులను, ఇట్లే శుభప్రాప్తి కొఱకు సౌరజగద్విద్యావేత్తలను, అన్నప్రాప్తి కొఱకు జల విద్వాంసులను, ఆహ్వానించి వారివలన లాభము పొందుట సమంజసము. ఇట్లే ప్రాణవిద్యల నెఱిగినవారి సాంగత్యమున నా విద్య నెఱుగుట ఉచితము.

**ఓం సుత్రామాణం పృథివీం ద్యామనేహసమ్**
**సుశర్మాణమదితిం సుప్రణీతిమ్**
**దైవీం నావం స్వరిత్రామనాగస**
**మస్రవంతీమారుహేమా స్వస్తయే.** (ఋ. 10-63-10) 16

సుత్రామాణం - రక్షణసాధనలతో గూడిన, పృథివీం - విశాలమైన, ద్యామ్ - ఆకాశచారియైన, అనేహసం - దోషరహితమైన, సుశర్మాణం - మంచిసుఖము నిచ్చునదియు: అదితిం - ఖండితముకాని, సుప్రణీతిం - దూరముతీసికొనిపోగల, దైవీం - దివ్యమైన, స్వరిత్రామ్ - శత్రుసంకటములనుండి కాపాడునది, అనాగసం - అపరాధ మొనర్పని, అస్రవంతీమ్ - నీటిలోను సురక్షితము నగు, నావం - నౌకను, స్వస్తయే - శుభప్రాప్తికై, ఆరుహేమ - ఎక్కుదుముగాక!

శుభముల నపేక్షించు మానవుడు అవసరమగునపుడు తన్ను రక్షించుకొనుటకు నన్నివిధముల సురక్షితమగు నౌకను - విమానమును అధిరోహించుట సముచితము. అట్టి విమానవర్ణన మిందు చేయబడినది.

**ఓం విశ్వే యజత్రా అధివోచతోతయే**
**త్రాయధ్వం నో దురేవాయా అభిహ్రుతః**

**సత్యయా వో దేవహూత్యా హువేమ**

**శృణ్వతో దేవా అవసే స్వస్తయే** (ఋ. 10-63-11) 17

విశ్వే యజత్రాః - సంపూర్ణయాజ్ఞిక విద్వాంసులారా! ఊతయే. రక్షణార్థము, అధివోచత - పూర్ణముగ నుపదేశింతురుగాక! దురేవాయాః - ఆపదలనుండి , అభిహ్రుతః - హింసకులనుండియు, నః - మమ్ములను, త్రాయధ్వం - రక్షింపుడు. దేవాః - విద్వాంసులారా! శృణ్వతః - వినుచున్న, నః - మమ్ములను, సత్యయా - సత్యవాక్కుతోను, దేవహూత్యా - ప్రశంసను దెలుపు స్తుతితోడను, అవసే - రక్షణకొఱకు, స్వస్తయే - శుభముకొఱకు, హువేమ - ఆహ్వానించుచున్నాము.

ఓ విద్వాంసులారా! కర్మనిరతులారా! మమ్ము రక్షింప ననువగు నుత్తమ - ఉపదేశముల నొసంగుడు. కష్టదాయకములగు ఆపత్తులనుండి మమ్ముల రక్షింపుడు. ఔన్నత్యము కల్యాణము నభిలషించి సత్యవచనములతోను, ప్రశంసాత్మక స్తుతులతోను మిమ్ముల నాహ్వానింతుము. మీరు మా యాహ్వానముల నాలింతురుగాక!

**ఓం అపామీవామప విశ్వామనాహుతి**

**మపారాతిం దుర్విదత్రామఘాయతః**

**ఆరే దేవా ద్వేషో అస్మద్యుయోతనోరు ణః**

**శర్మ యచ్ఛతా స్వస్తయే.** (ఋ. 10-63-12) 18

దేవాః- ఓ విద్వాంసులారా! అమీవాం - రోగకారణ కీటమును, అప - తొలగించుడు, అనాహుతిం - యజ్ఞమున అహుతి నియ్యనట్టి, విశ్వాం - సంపూర్ణభావనను, అప - తొలగించుడు, అరాతిం - త్యాగముచేయని ప్రవృత్తిని, దుర్విదత్రాం - దుష్టబుద్ధిని, అఘాయతః - పాపులను; ద్వేషః- వైరభావమును, అస్మత్ - మానుండి, ఆరే - దూరమున, యుయోతన - ఉండునట్లు చేయుడు. నః - మాకు, ఉరు - ఎక్కువ, శర్మ - సుఖము, స్వస్తయే - శుభముకొఱకు, యచ్ఛత - ఇత్తురుగాక!

వైద్యము నెఱుగు ఓ విద్వాంసులారా! రోగమును కలిగించు కారణములను, కీటాణువులను మానుండి దూరముచేయుడు, అట్లే

శుభ కర్మలు చేయకుండునట్టి భావనలు, ఆలోచనలు మాకు కలుగకుండునట్లు బోధింపుడు. మేము శుభకర్మలు చేయునట్లు అనుగ్రహింపుడు. త్యాగము చేయని ప్రవృత్తిని మానుండి తొలగింపుడు. పాపులను, పాపబుద్ధులను మాకు దూరముగ నుంచుడు. మే మెవరిని ద్వేషింపకుందుముగాక! సుఖ సాధనములను మాకు చేకూర్చుడు. వాని వలన మాకు శుభము చేకూరు గాక!

**ఓం అరిష్టః స మర్తో విశ్వ ఏధతే**
**ప్రప్రజాభిర్జాయతే ధర్మణస్పరి**
**యమాదిత్యాసో నయథా సునీతిభి**
**రతి విశ్వాని దురితా స్వస్తయే.** (ఋ. 10-63-13) 19

ఆదిత్యాసః - ఓ నైష్ఠికబ్రహ్మచారులార! మీరు, యమ్ - ఎవనిని, సునీతిభిః - మంచినీతులతో, స్వస్తయే - శుభప్రాప్తి కొఱకు, విశ్వాని దురితా - సమస్త దుర్ వ్యసనములనుండి, అతినయథ - దూరమున నుంతురో - దూరముగ నడపుదురో, సః మర్తః - ఆ మనుష్యుడు, అరిష్టః - విఘ్నరహితుడై, విశ్వఏధతే - అన్ని విధముల వర్ధిల్లును, ధర్మణఃపరి - ధర్మాచరణానంతరము, ప్రప్రజాభిః - మిక్కిలి సంతానముతో, జాయతే - సంయుక్తుడగును.

ఓ యాదిత్యబ్రహ్మచారులారా! మీవలన శిక్షితుడై, దుర్వ్యసనములకు, పాపములకు దూరముగనుండు వ్యక్తి లోకమున ధార్మికు డగును. నిర్విఘ్నముగ నతడు సర్వతోముఖవృద్ధిని బొందును. ధర్మాచరణానంతరము సుసంతానమును బడసి జనులలో ప్రతిష్ఠితుడగును. ఇతరులకు మార్గదర్శకు డగును.

**ఓం యం దేవాసోఽవథ వాజసాతౌ**
**యం శూరసాతా మరుతో హితే ధనే**
**ప్రాతర్యావాణం రథమింద్ర సానసి**
**మరిష్యంతమా రుహేమా స్వస్తయే.** (ఋ. 10-63-14)20

దేవాసః - విద్వాంసులారా! వాజసాతౌ - అన్నప్రాప్తి కొఱకు, యమ్ - దేనిని - ఏ శరీరమును, అవథ - రక్షింతురో, శూరసాతాః మరుతః - శౌర్యయుక్తులైన వాయు సమానవీరులారా! హితే ధనే - హితము నిచ్చు యుద్ధ

సమయమున, యమ్ - దేనిని రక్షింతురో, ( ఆ శరీరముతో మంచి చేయుడు) ఇంద్ర - ఓ జీవాత్మా! ప్రాతః - ప్రాతః సమయమునుండియు, యావాణం - నడచునట్టియు, సానసిం - సుఖము నిచ్చునట్టియు, అరిష్యంతం - విఱిగిపోనట్టియు, రథం - రథమును, స్వస్తయే - శుభప్రాప్తికై, ఆరుహేమ - ఎక్కుదుముగాక!

విద్వాంసులు అన్నప్రాప్తికై శరీరమును రక్షింతురు - వీరులు శత్రువులను జయించుటకు, ధనాదిప్రాప్తికి దేహమును కాపాడుదురు. జీవాత్మ యే శరీరమునం దా రూఢమై సర్వకార్యములు ప్రాతఃకాలమునుండి నిర్వర్తించునో యా శరీరముతో తన శుభముకొఱకును యత్నించుట మంచిది. ఈ శరీరముతోనే జీవుడు నిస్సంగుడై శుభకర్మల నాచరించి మోక్షసుఖము పొందగలడని భావము.

**ఓం స్వస్తి నః పథ్యాసు ధన్వసు**
**స్వస్త్యప్సు వృజనే స్వర్వతి**
**స్వస్తి నః పుత్రకృథేషు యోనిషు**
**స్వస్తి రాయే మరుతో దధాతన.** (ఋ. 10-63-15)21

మరుతః - వాయువువలె బలవంతులగు వీరులారా! నః పథ్యాసు - మా ప్రదేశములలో, ధన్వసు - మరుభూములలోను, స్వస్తి - శుభముకలుగుగాక! అప్సు - జలమునందును, స్వస్తి - శుభమగుగాక! వృజనే - అంతరిక్ష బల ప్రదర్శనమునందు, స్వర్వతి - సైనికస్థలములందును, స్వస్తి - శుభము కలిగింపుడు, పుత్ర కృథేషు - పుత్రుల నుత్పన్నముచేయు, యోనిషు - కారణములందు, నః - మాకు, స్వస్తి - శుభము కలిగింపుడు, రాయే - ధనము కొఱకు, స్వస్తి - శుభమును, దధాతన - ధారణచేయుడు.

వాయువువలె బలవంతులగు వీరులారా! జలస్థల నభో మండలము లందు మమ్ముల రక్షించి శుభము లొనగూర్చుడు. మరుప్రదేశము లందు సైనిక విన్యాసములందును మమ్ముల రక్షింపుడు. సంతానోత్పత్తి యోగ్యకారణములందును మాకు రక్షణ నొసంగవలయును. ధనాదులను చేకూర్చి శుభము నొసంగుడు.

ఓం **స్వస్తిరిద్ధి ప్రపథే శ్రేష్ఠా**
**రేక్ణస్వత్యభి యా వామమేతి**
**సా నో అమా సో అరణే నిపాతు**
**స్వావేశా భవతు దేవగోపా.** (ఋ. 10-63-16) 22

యా - ఏభూమి, ప్రపథే - మార్గమందు, ఇత్‌హి - నిశ్చయముగా, స్వస్తి - శుభము నిచ్చునో, శ్రేష్ఠా - ఉత్తమమో, రేక్ణస్వతీ - ధనధాన్యములతో నిండి యుండునో, వామం - సుందరకృత్యముల నొనర్చ, అభిఏతి - లభించునో, సా - ఆ భూమి, నః - మాకు, అమా - నిలయము - ఇల్లు, (సా+ఉ) సో - అదియే, అరణే - శాంత వాతావరణమునందు, నిపాతు- నిశ్చితముగ రక్షించుగాక! స్వవేశా - సుందరమగు ఆవాసయోగ్యము, దేవగోపా - విద్వద్రక్షితము, భవతు - అగుగాక!

ఏ భూమియందు సర్వశుభములు నిశ్చితముగా గలుగునో ఎట మార్గములు శుభదాయకములో, ఏది ధనధాన్యములతో నిండియుండునో ఆ భూమి మాకు వాసయోగ్య మగుగాక! అటనే మా నివాసగృహములు శుభదాయకము లగుగాక! యుద్ధాదులతో సంకటములకు తావీయక శాంత వాతావరణములందు విద్వాంసులచే, వీరులచే, వైజ్ఞానికులచే మేము రక్షింపబడుదుము గాక!

ఓం **ఇషే త్వోర్జే త్వా వాయవ స్థ దేవో వః**
**సవితా ప్రార్పయతు శ్రేష్ఠతమాయ కర్మణ,**
**ఆప్యాయధ్వ మఘ్న్యా ఇంద్రాయ భాగమ్,**
**ప్రజావతీ రనమీవా అయక్ష్మా మా వ స్తేన ఈశత,**
**మాఘశంసో ధ్రువా అస్మిన్ గోపతౌ స్యాత,**
**బహ్వీర్యజమానస్య పశూన్ పాహి.** (య. 1-1) 23

ఓ పరమేశ్వర! ఇషే - అన్నముకొఱకు, ఊర్జే - బలముకొఱకు, త్వా - నిన్ను స్మరింతుము, వాయవః - ప్రాణాదివాయువులు, స్థ - వానితావులం దుండుగాక! సవితా దేవః - సృష్టికర్తయగు దేవుడు. వః - మిమ్ములను,

శ్రేష్ఠతమాయ కర్మణే - ఉత్తమోత్తమ కర్మలకొఱకు, ప్రార్పయతు - అర్పించుగాత! నియమించుగాక! ఆప్యాయధ్వమ్ - ఆ కర్మల నొనర్చి వృద్ధినొందుదురుగాక! అనమీవాః - రోగరహితములు, ప్రజావతీః - సంతానవంతములు, అయక్ష్మాః - క్షయాదిరోగములులేని, అఘ్న్యాః- వధింప నర్హములు కాని గోవులు, ఇంద్రాయ - జీవునకు, మానవమాత్రునకు, భాగం - దుగ్ధభాగము నొసంగుగాక! స్తేనః - చోరుడు, వః మిమ్ములను, మా ఈశత - పాలింపకుండుగాక! వశపఱచుకొనకుండుగాక! మాఅఘశంసః - పాపి కాకుండుగాక! అస్మిన్ గోపతౌ - ఈ గోరక్షకునియందు, స్యాత - శక్తి యుండునుగాక! యజమానస్య - యజమానుని, బహ్వీఃపశూన్ - బహుపశువులను, పాహి - రక్షింపుము.

ఓ పరమేశ్వరా! మా శరీరములందు ప్రాణాదులు సుస్థిరములై యుండి, మా భోజ్యపదార్థములు బాగుగ జీర్ణించి బలవంతులమగున ట్లనుగ్రహింపుము. ఓ జగదుత్పాదక దేవ! మేము ఉత్తమోత్తమ కార్యముల నొనర్చున ట్లనుగ్రహింపుము. మా గోవులు క్షయాదిరోగములు లేనివై, సంతానవంతములై దుగ్ధముల నిచ్చి మమ్ముల నారోగ్యవంతుల జేయునుగాక! వానినెన్నడును మేము వధింపకుందుముగాక! అవి చోరులపాలు గాకుండుగాక! మేము పాపులముగాకుండ సదా గోరక్షకులము, పశుపాలకులము నగుదుముగాక!

**ఓం ఆ నో భద్రాః క్రతవో యంతు విశ్వతోz**
**దబ్ధాసో అపరీతాస ఉద్భిదః**
**దేవా నో యథా సదమిద్వృధే**
**అసన్నప్రాయువో రక్షితారో దివేదివే.** (య. 25-2) 24

హే భగవన్ ! భద్రాఃక్రతవః - శుభప్రదకార్యములు, నః మాకు, విశ్వతః - సర్వవిధముల, ఆయంతు - ప్రాప్తములగుగాక! అదబ్ధాసః - అవి నిర్విఘ్నము లగుగాక! అపరీతాసః - కార్యరూపముల నొందకముందు గుప్తములుగా నుండుగాక! ఉద్భిదః - అవి యన్యకార్య సంపాదకములగుగాక! దేవాః - విద్వాంసులు, సదమ్ ఇత్ - ఎల్లప్పుడు, నః - మా, యథావృధే - ఉన్నతికలుగునట్లు, ఆసన్ - సహాయకులగుదురు గాక! దినేదినే - ప్రతిదినము,

(వారు) అప్రాయువః - జాగరూకులు, రక్షితారః - రక్షకులునై యుందురుగాక!

భగవన్ ! మేము ఉత్తమకర్మలు చేయుదుముగాక! అవి మాకు శుభప్రదములు, ఉత్సాహప్రదములు నగుగాక! నిర్విఘ్నములై, గుప్తములై, హింసారహితములై యుండుగాక! విద్వాంసులు అప్రమత్తులై మమ్ము కాపాడుదురు గాక!

**ఓం దేవానాం భద్రా సుమతిర్ఋజూయతామ్**
**దేవానాం రాతిరభి నో నివర్తతామ్**
**దేవానాం సఖ్యముప సేదిమా వయమ్**
**దేవా న ఆయుః ప్రతిరంతు జీవసే (య. 25-15) 25**

దేవానాం - విద్వాంసుల, భద్రా సుమతిః - శుభప్రద బుద్ధి; ఋజూయతామ్ - మమ్ము ఋజుప్రవర్తనుల జేయుగాక! దేవానాం - విద్వాంసుల, రాతిః - దానగుణము: నః - మా వంకకు, నివర్తతామ్ - మరలుగాక! వయమ్ - మేము, దేవానాం సఖ్యం - విద్వాంసుల మైత్రిని, ఆ ఉపసేదిమ - పొందుదుముగాక! దేవాః - విద్వాంసులు, జీవసే - దీర్ఘకాలము జీవించుటకై, నః - మాకు, ఆయుః - ఆయువును, ప్రతిరంతు - ఇత్తురుగాక!

భగవన్! విద్వాంసుల శోభనబుద్ధి మమ్ము సరళహృదయులనుజేయు గాక! వారి మైత్రిని సంపాదించి వారి దానప్రవృత్తిని మేము కూడ నలవఱచు కొందుము గాక! వారివలన జీవిత సాధనముల నెఱిగి దీర్ఘకాలము జీవింతుము గాక! వారు మాకు మార్గదర్శకు లగుదురు గాక!

**ఓం తమీశానం జగతస్తస్థుషస్పతిమ్**
**ధియం జిన్వమవసే హూమహే వయమ్**
**పుషా నో యథా వేదసామసద్వృధే**
**రక్షితా పాయురదబ్ధః స్వస్తయే (య 25-17) 26**

జగతః - జంగమము, తస్థుషః - స్థావరము నగు ప్రపంచమునకు, పతిమ్ - స్వామియు, ధియం జిన్వం - బుద్ధియందు సంతోషము నిచ్చునట్టియు, తం ఈశానం - ఆ పరమైశ్వర్య శాలియగు భగవంతుని, అవసే - రక్షణార్థము,

వయమ్ - మేము, హూమ హే - ఆహ్వానింతుము - స్తుతింతుము, పూషా - పోషకుడగు నా దేవుడు, నః - మాకు, వేదసాం - ధనముల, వృధే - వృద్ధికొఱకు, అదబ్ధః స్వస్తయే - నిర్విఘ్నముగా లభించు శుభములకు, పాయుః - పాలకుడు, రక్షితా - రక్షకుడును అగుగాకః

ఈ చరాచరాత్మకమగు జగత్తునకు స్వామియగు పరమేశ్వరుని స్తుతియింతుము. అతడు మాకు సంతోషము కలిగించును - శుభసంకల్పముల నుదయింపజేయును. మమ్ము రక్షించును. జగత్ పోషకుడు మా ధనవృద్ధికి తోడ్పడును. విఘ్నములను వారించును.

**ఓం స్వస్తి న ఇంద్రో వృద్ధశ్రవాః**
**స్వస్తి నః పూషా విశ్వవేదాః**
**స్వస్తి నస్తార్క్ష్యో అరిష్టనేమిః**
**స్వస్తి నో బృహస్పతిర్దధాతు.** (య. 25-19.) 27

ఇంద్రః - ఐశ్వర్యవంతుడగు భగవంతుడు, నః-మనకు, స్వస్తి - శుభమునిచ్చుగాక! వృద్ధశ్రవాః - గొప్పకీర్తిగల దేవుడు, నః స్వస్తి - మనకు శుభప్రదుడు, పూషా - పోషకుడు, విశ్వవేదాః - సర్వజ్ఞుడు నగు దేవుడు, నః స్వస్తి - మనకు భద్రమిచ్చువాడు, అరిష్టనేమిః - అప్రతిహతగతి కల్గి, తార్క్ష్యః - తరింపజేయు దేవుడు, నః స్వస్తి - మనకుకల్యాణకరు డగును. బృహస్పతిః - వేదవాణికి పతియగు పరమేశ్వరుడు, నః - మనలను, దధాతు - ధరించునుగాక! ఆశ్రయమగుగాక!

ఐశ్వర్యశాలియు, అనంతకీర్తిమంతుడు నగు దేవుడు మనలను వినాశము నొందకుండ కాపాడుగాక! పాలించి పోషించుగాక: సర్వజ్ఞుడగు నా దేవుడు సంసారసాగరమునుండి మనలను తరింపజేయుగాక: వినాశము నొందనీయక జీవింపజేయుగాక!

**ఓం భద్రం కర్ణేభిః శృణుయామ దేవా**
**భద్రం పశ్యేమాక్షభిర్యజత్రాః**
**స్థిరైరంగైస్తుష్టువాగ్ంసస్తనూభి**
**ర్వ్యశేమహి దేవహితం యదాయుః** (య. 25-21.) 28

దేవాః - విద్వాంసులారా! కర్ణేభిః - చెవులతో: భద్రం శృణుయామ - శుభమును విందుముగాక! అక్షభిః - కన్నులతో, భద్రం పశ్యేమ - ఉత్తమ దృశ్యములను చూతుముగాక! యజత్రా - కర్మయోగులార! స్థిరైః అంగైః - సుస్థిరములగు నంగములతో, తుష్టువాగ్ంసః - స్తుతుల నొనర్చుచు, తనూభిః - శరీరములతో, దేవహితం యత్ ఆయుః - దేవుని స్తుతింపదగు ఆయువును, వ్యశేమహి - అనుభవింతుము.

కర్మయోగులార! మేమెల్లప్పుడు ఆరోగ్యవంతములగు శ్రవణాది ఇంద్రియములతో శుభముల నాలింతుము: చూతుము: అనుభవింతుము. బలముగల శరీరాంగములతో విద్వాంసులకు, దేవునికి హితకరములగు కర్మల నొనర్చుచు జీవనయాపనము చేయుదుముగాక!

**ఓం అగ్న ఆ యాహి వీతయే, గృణానో హవ్యదాతయే,**
**ని హోతా సత్సి బర్హిషి. ( సా. ఛంద. ఆ.ప్రపా.1-1.) 29**

అగ్నే! - ప్రకాశస్వరూప! వీతయే - ముక్తిప్రాప్తికి - ముక్తి నొసంగుటకు, ఆయాహి - రమ్ము - చిత్తైకాగ్రతను కలిగింపుము. హవ్యదాతయే - ఇష్టఫలముల నిచ్చుటకు, గృణానః- స్తుతి కనుకూలముగ, నిహోతా - ప్రపంచమును నిర్మింతువు. నశింపజేయుదువు, బర్హిషి - అంతర్బాహ్యములలో, సత్సి - ఉందువు.

ప్రకాశస్వరూప పరమేశ్వర ! నీవు ముక్తిదాతవు. సృష్టిసంహారముల నొనర్తువు. ప్రపంచమున నెల్లయెడల లోపల వెలుపల నుందువు. నిన్ను ప్రార్థింతుము, మా చిత్తము నేకాగ్రము చేయుటకు తోడ్పడుము, ఇష్టఫలముల నొసంగుము.

**ఓం త్వమగ్నే ! యజ్ఞానాం హోతా, విశ్వేషాం హితః,**
**దేవేభిర్మానుషే జనే. (సా. ఛంద. ఆ.ప్రపా. 1-2) 30**

అగ్నే: - ప్రకాశస్వరూప ప్రభూ! త్వం - నీవు, యజ్ఞానాం - యజ్ఞములను, హోతా - పూర్తిచేయువాడవు. విశ్వేషాం - ఎల్లరకు. హితః - మేలుచేయువాడవు. మానుషే జనే - మనుష్యజన్మమందు, దేవేభిః - దివ్య గుణములతో నీ వుందువు.

ఓ పరమేశ్వరా! నీవు సదా యెల్లరిలో నుండి యెల్లరి కార్యములకు ఫలముల నిత్తువు. నీ వెవ్వరికి అహిత మొనర్పవు. నీ విట్లే ప్రసిద్ధుడవు.

**ఓం యే త్రిషప్తాః పరియంతి, విశ్వా రూపాణి బిభ్రతః**
**వాచస్పతిర్బలా తేషామ్, తన్వో అద్య దధాతు మే.**

**(అథ. కాం. 1. అను1ప్రపా 1. మం. 1) 31**

యే త్రిషప్తాః - ఇరువది యొక్క పదార్థము లెయ్యవి కలవో; అవి, విశ్వారూపాణి - వివిధ రూపములను, బిభ్రతః - ధరించుచు, పరియంతి - మార్పుజెందుచుండును. వాచస్పతిః - వేదరక్షకుడగు దేవుడు, తేషాం బలా - వానిబలమును, అద్య - ఇప్పుడు, మే తన్వః - నాశరీరమున, దధాతు - ఉంచుగాక!

పంచభూతములు, పంచజ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు అంతఃకరణము, పంచప్రాణములు కలిసి యిరువది యొకటియగును. ఇవి యెల్లప్పుడు మాఱి నానా రూపములు ధరించును. పరమేశ్వరుడు నా శరీరమున వీనిని బలయుక్తము చేయుగాక!

ఇతి స్వస్తివాచన ప్రకరణమ్.

## శాంతి ప్రకరణము

**ఓం శంన ఇంద్రాగ్నీ భవతామవోభిః**
**శంన ఇంద్రావరుణా రాతహవ్యా**
**శమింద్రాసోమా సువితాయ శం యోః**
**శంన ఇంద్రాపూషణా వాజసాతౌ.** ( ఋ. 7-35-1.) 1

ఇందాగ్నీ - విద్యుదగ్నులు, అవోభిః - రక్షణసాధనములతో, నః - మాకు, శం భవతామ్ - శాంతిదాయకము లగుగాక! ఇంద్రా వరుణా - విద్యుజ్జలములు, నః - మాకు, శం - శాంతి , రాతహవ్యా - గ్రాహ్యపదార్థముల నొసంగునవి యగుగాక! ఇంద్రాసోమా - విద్యుత్తుఔషధములు. శం - శాంతినిచ్చుగాక! సువితాయ - శుభముకొఱకు, శంయోః - రోగనాశకములై సుఖమునిచ్చుగాక! ఇంద్రాపూషణా - విద్యుత్ వాయువులు, నః - మాకు,

వాజసాతౌ - అన్నోత్పాదనమున, శం - శాంతిదాయకములగు గాక!

భగవన్ - విద్యుత్తు, అగ్ని, జలము, ఓషధులు, వాయువు అన్నియు మాకు శాంతిని ప్రసాదించుగాక! గ్రహింపదగు వస్తువులను లభింపజేయును గాక! ఆరోగ్యమును, శాంతిని శుభమును ఇచ్చి అన్నోత్పాదనమున తోడ్పడుగాక!

ఓం **శంనో భగః శము నః శంసో అస్తు**
**శంనః పురంధిః శము సంతు రాయః**
**శంనః సత్యస్య సుయమస్య శంసః**
**శంనో అర్యమా పురుజాతో అస్తు.** (ఋ. 7-35-2) 2

భగః - ఐశ్వర్యము, నః - మాకు, శం - శాంతిదాయక మగుగాక! శంసః - ఉపదేశము, నః - మాకు, శమ్ ఉ అస్తు - శాంతిదాయకమగుగాక! నః - మా, పురంధిః - శరీరమునందలి బుద్ధి, శం - శాంతినిచ్చుగాక! రాయః - ధనరాసులు, శమ్ ఉ సంతు - శాంతిదాయకము లగు గాక! నః - మా, సత్యస్య - సత్యమునకు సంబంధించిన, సుయమస్య - సునియంత్రిత, శంసః - ఉపదేశము, శం - శాంతి నిచ్చుగాక, నః- మా, అర్యమా - న్యాయ మొనర్చు పురుషుడు, పురుజాతః అస్తు - మిక్కిలి ప్రసిద్ధు డగుగాక!

భగవన్! మా యైశ్వర్యము, ఉపదేశములు, ధనరాసులు. బుద్ధి అన్నియు శాంతిదాయకము లగుగాక! మాలో న్యాయ నిర్ణయము నొనర్చు పురుషుడు మిక్కిలి ప్రసిద్ధు డగుగాక!

ఓం **శంనో ధాతా శము ధర్తా నో అస్తు**
**శంన ఉరూచీ భవతు స్వధాభిః**
**శం రోదసీ బృహతీ శం నో అద్రిః**
**శం నో దేవానాం సుహవాని సంతు.** (ఋ. 7-35-3) 3

ధాతా - పోషకుడు, నః - మాకు, శం - శాంతినిచ్చువాడు, ధర్తా - ధారణచేయువాడు, నః - మాకు, ఉ - నిశ్చితముగ, శం అస్తు - శాంతిదాత యగుగాక! ఉరూచీ - అధికగతిమంతమగు భూమి, నః - మాకు, ఉ - నిశ్చితముగ, శం అస్తు - శాంతిదాత యగుగాక ! ఉరూచీ - అధిక

గతిమంతమగు భూమి, నః - మాకు, స్వధాభిః - అన్నములతో బాటు, శం భవతు - శాంతికారకమగుగాక! బృహతీ - విస్తృత, రోదసీ - ద్యులోకము, భూలోకము, నః - మాకు, శం - శాంతిదాయకమగు గాక! దేవానాం - విద్వాంసుల, సుహవాని - మధుర ఉపదేశములు, నః - మాకు, శం సంతు - శాంతిదాయకము లగుగాక!

భగవన్! మా పోషకులు మాకు శాంతినిచ్చుగాక! పుణ్యపాపములను వివేచించి ధారణచేయువాడు మాకు శాంతినిచ్చుగాక! విశాల పృథివి మాకు అన్న మిచ్చి శాంతి నొసంగుగాక! ద్యులోకము, మేఘములు విద్వాంసుల మధురోపదేశములు అన్నియు శాంతినిచ్చుగాక!

**ఓం శంనో అగ్నిర్జ్యోతిరనీకో అస్తు**
**శంనో మిత్రావరుణావశ్వినా శం**
**శంనః సుకృతాం సుకృతాని సంతు**
**శంన ఇషిరో అభివాతు వాతః.** (ఋ. 7-35-4) 4

అగ్నిః - తేజస్వియు, జ్యోతిః - బలశాలియునగు, అనీక ః - సేనా సమూహము, నః - మాకు , శం - శాంతిదాయకము, అస్తు - అగుగాక! మిత్రా వరుణౌ - ప్రాణోదానవాయువులు, అశ్వినా - జితేంద్రియులగు స్త్రీ పురుషులు, నఃశం-మాకు శాంతిదాయకులగుదురుగాక! సుకృతాం-పుణ్యవంతుల, సుకృతాని - సత్ కార్యములు. నః శం సంతు - మాకు శాంతి నిచ్చునవి యగుగాక! ఇషిరః వాతః - గమనశీల వాయువు, నః శం అభివాతు - మాకు శాంతి గలుగునట్లు వీచునుగాక!

తేజస్సు, బలముతో గూడిన సేనావారములు, ప్రాణోదానములు, జితేంద్రియులగు స్త్రీ పురుషులు, పుణ్యవంతు లొనర్చు సత్కార్యములు, గతిశీలమగు వాయువు మా కెల్ల వేళల శాంతి నొడగూర్చుగాక!

**ఓం శంనో ద్యావాపృథివీ పూర్వహూతౌ**
**శ మంతరిక్షం దృశయే నో అస్తు**
**శం న ఓషధీర్వనినో భవంతు**
**శం నో రజసస్పతిరస్తు జిష్ణుః.** (ఋ. 7-35-5) 5

పూర్వహూతౌ - పూర్వులచే ప్రశంసిత, ద్యావాపృథివీ - భూ ద్యులోకములు, నః - శం - మాకు శాంతిదాయకము లగుగాక! అంతరిక్షం - అంతరిక్షము, నః-మా, దృశయే - దృష్టికి, శం అస్తు - శాంతి నిచ్చునది యగు గాక! వనినః ఓషధీః - వనౌషధములు, నః శం భవంతు - మాకు శాంతి కారకములగుగాక! జిష్ణుః - జయశీలుడగు, రజసస్పతిః - భూపతి, శం నః అస్తు - మాకు శాంతినిచ్చువా డగుగాక!

మా పూర్వులచే ప్రశంసితము లయిన ద్యు భూలోకములు, నిర్మల మగు అంతరిక్షము, అడవియందు లభించు మూలికలు, జయశీలుడగు నరపతి ఎల్లరు మాకు శాంతి నిత్తురుగాక!

ఓం **శంన ఇంద్రో వసుభిర్దేవో అస్తు**
**శమాదిత్యేభిర్వరుణః సుశంసః**
**శం నో రుద్రో రుద్రేభిర్జలాషః**
**శం న స్త్వష్టా గ్నాభిరిహ శృణోతు** (ఋ. 7-35-6.) 6

ఇంద్రః దేవః - సదాచారియగు ఆచార్యుడు, వసుభిః ఆదిత్యేభిః - వసు ఆదిత్యనామక బ్రహ్మచారులతో గూడిమాకు శాంతిదాయకు డగుగాక! సుశంసః వరుణః - ప్రశంసాపాత్రుడై యెన్నుకొనబడిన రాజు - రాష్ట్రపతి మాకు శాంతి చేకూర్చుగాక! జలాషః రుద్రః - సంతాపనాశకుడగు దండనాధికారి, రుద్రేభిః - రుద్రబ్రహ్మచారులతో గూడి దుష్టులను దండించుచు మాకు శాంతి నిచ్చుగాక! త్వష్టా - వ్యాపక విద్వాంసుడు. గ్నాభిః - తన వాక్కు లతో మాకు ఉపదేశించుచు, ఇహ శృణోతు - మా ప్రార్థనల నాలించుగాక!

ఓం **శం నః సోమో భవతు బ్రహ్మ శం నః**
**శం నో గ్రావాణః శము సంతు యజ్ఞాః**
**శం నః స్వరూణాం మితయో భవంతు**
**శం నః ప్రస్వః శమ్వస్తు వేదిః.** (ఋ. 7-35-7.) 7

సోమః - సోమలత, బ్రహ్మ-వేదవాణి, గ్రావాణః-మేఘములు, యజ్ఞాః-యజ్ఞములు, స్వరూణాం మితయః - యజ్ఞమండప స్తంభముల కొలతలు, ప్రస్వః - ఓషధులు, వేదిః - యజ్ఞవేది అన్నియు మాకు శాంతి నొడగూర్చునవి

యగుగాక:

**ఓం శం నః సూర్య ఉరుచక్షా ఉదేతు**
**శం నశ్చతస్రః ప్రదిశో భవంతు**
**శం నః పర్వతా ధ్రువయో భవంతు**
**శం నః సింధవః శము సంత్వాపః (ఋ. 7-35-8)8**

ఉరుచక్షా సూర్యః - మిక్కిలిగా ప్రకాశించు సూర్యుడు, చతస్రః ప్రదిశః - నాలుగు దిక్కులు, ధ్రువయః పర్వతాః - స్థిరముగానుండు పర్వతములు, సింధవః - నదులు, ఆపః - వాపీ కూప తటాకాదుల జలములు,నః- మాకు, సదా శంభవన్తు-శాంతికారకము లగుగాక!

**ఓం శం నో అదితిర్భవతు వ్రతేభిః**
**శం నో భవంతు మరుతః స్వర్కాః**
**శం నో విష్ణుః శము పూషా నో అస్తు**
**శం నో భవిత్రం శమ్వస్తు వాయుః. (ఋ.7-35-9.)9**

అదితిః-విద్వాంసుల తల్లి, వ్రతేభిః - వ్రతముల - సత్కర్మలతోను, స్వర్కాః మరుతః - ప్రశంసాపాత్రులగు విద్వాంసులు, విష్ణుః పూషా - వ్యాపకుడు పోషకుడు నగు పరమేశ్వరుడు, భవిత్రం - మా భవిష్యత్తు, వాయుః- వాయువు, ఎల్లరు నః- శంభవంతు- మాకు శాంతిదాయకు లగుదురుగాక!

**ఓం శం నో దేవః సవితా త్రాయమాణః**
**శం నో భవంతూషసో విభాతీః**
**శం నః పర్జన్యో భవతు ప్రజాభ్యః**
**శం నః క్షేత్రస్య పతిరస్తు శంభుః (ఋ. 7-35-10)10**

త్రాయమాణః సవితా దేవః - మనలను రక్షించు జగదుత్పాదక దేవుడు, మనకు, శం - శాంతిదాయకు డగుగాక! విభాతీః ఉషసః - ప్రకాశించు ఉషస్సులు - ప్రభాతవేళలు, పర్జన్యః - మేఘుడు, ప్రజాభ్యః - ప్రజలకు,శం- శాంతిని చేకూర్చుగాక! క్షేత్రస్య పతిః - కృషీవలుడు, ధాన్యముల నుత్పన్నము చేయుచు, శంభుః - శుభముల నొసంగుగాక!

ఓం శం నో దేవా విశ్వదేవా భవంతు
శం సరస్వతీ సహ ధీభి రస్తు
శమభిషాచః శము రాతిషాచః
శం నో దివ్యాః పార్థివాః శంనో అప్యాః (ఋ. 7-35-11) 11

విశ్వదేవాః దేవాః - సర్వైశ్వర్యముల నిచ్చు విద్వాంసులు, సహధీభిః సరస్వతీ - బుద్ధులతో గూడిన విద్యామాత, అభిషాచః-తపోవంతులు, రాతిషాచః - త్యాగులు, దివ్యాః పార్థివాః - శ్రేష్ఠములగు పార్థివపదార్థములు అప్యాః- జల పదార్థములు, అన్నియు మాకు శం-శాంతి నిచ్చుగాక!

ఓం శం నః సత్యస్య పతయో భవంతు
శం నో అర్వంతః శము సంతు గావః
శం న ఋభవః సుకృతః సుహస్తాః
శం నో భవంతు పితరో హవేషు. (ఋ. 3-35-12) 12

సత్యస్య పతయః - సత్యవ్రతులగు విద్వాంసులు, అర్వంతః - మంచి గుఱ్ఱములు, గావః - గోవులు, శాంతినిచ్చుగాక, సుకృతః సుహస్తాః ఋభవః - ఉత్తమకర్మ లొనర్చు సిద్ధహస్తులైన వైజ్ఞానికులు, శిల్పులు, వైద్యులు ఎల్లరు - శాంతి నిత్తురుగాక! పితరః - అనుభవముగల వ్యక్తులు, హవేషు - శ్రేష్ఠకార్యములందు తోడ్పడి నః-మాకు, శం- శాంతి నిత్తురుగాక!

ఓం శం నో అజ ఏకపాద్దేవో అస్తు
శం నోఽహిర్బుధ్న్యః శం సముద్రః
శం నో అపాం నపాత్పేరురస్తు
శం నః పృశ్నిర్భవతు దేవగోపా. (అథ. 19-13-3) 13

అజః ఏకపాత్ దేవః - జన్మరహితుడు, ఏకాంశమున సర్వప్రపంచము కలవాడు నగు పరమేశ్వరుడు, అహిర్ బుధ్న్యః-మేఘము, సముద్రః - సముద్రము, అపాం నపాత్ పేరు - జలములలో చక్రములు లేకయే నడచు ఓడ - నౌక, దేవగోపా పృశ్నిః - విద్వద్రక్షిత గోవు, అన్నియు నః మాకు, శం- శాంతి నిచ్చుగాక!

**ఓం ఇంద్రో విశ్వస్య రాజతి,**

**శన్నో z అస్తు ద్విపదే శం చతుష్పదే. (యజు. 36-8) 14**

ఇంద్రః-పరమైశ్వర్యశాలి యగు దేవుడు, విశ్వస్యరాజతి-విశ్వమును ప్రకాశింపజేయును - జనింపజేయును, అతడు, నః ద్విపదే చతుష్పదే శం అస్తు - రెండు, నాలుగు పాదములు గల మాకు, మాప్రాణులకు - పశ్వాదులకు శాంతి నిచ్చుగాక!

**ఓం శన్నో వాతః పవతాగ్ం, శన్న స్తపతు సూర్యః**

**శన్నః కనిక్రదద్దేవః పర్జన్యో zఅభివర్షతు. (య. 36-10) 15**

వాతః - వాయువు మాకు శాంతికారకముగ, పవతాం - ప్రవహించుగాక! సూర్యః శంః నః తపతు - సూర్యుడు శాంతి కలిగించునట్లు ప్రకాశించుగాక - వేడి నిచ్చుగాక! కనిక్రదద్ దేవః పర్జన్యః శం నః అభివర్షతు - గర్జించుచు మేఘములు శాంతిదాయకములై వర్షించుగాక!

**ఓం అహాని శం భవంతు నః శం రాత్రీః ప్రతిధీయతామ్,**

**శన్న ఇంద్రాగ్నీ భవతామవోభిః, శన్న zఇంద్రావరుణా**

**రాతహవ్యా శన్నz ఇంద్రాపూషణా వాజసాతౌ,**

**శమింద్రాసోమా సువితాయ శంయోః (య 36-11) 16**

అహాని రాత్రీః - పగళ్ళు రాత్రులు శుభంకరములై శాంతి నిచ్చుగాక! ఇంద్రాగ్నీ అవోభిః-విద్యుత్తు అగ్ని రక్షణలతో శాంతి నిచ్చునవగుగాక! ఇంద్రావరుణా రాత హవ్యా - సూర్యుడు మేఘములు ఖాద్యమును స్వయముగా గ్రహించునవై శాంతి నిచ్చుగాక! ఇంద్రా పూషణా - విద్యుత్తు, వాయువులు, వాజసాతౌ - అన్నగ్రహణ సమయమున శాంతి నిచ్చుగాక! ఇంద్రా సోమా - విద్యుత్తు, ఓషధులు, సువితాయ శంయోః - రోగముల నశింపజేసి సుఖముల నిచ్చుచు శాంతిదాయకము లగుగాక!

**ఓం శన్నో దేవీరభిష్టయ, zఆపో భవంతు పీతయే**

**శంయోరభి స్రవంతు నః (య. 36-13) 17**

దేవీః - దివ్యగుణములుగల, ఆపః - జలము, వ్యాపకపరమేశ్వరుడు,

నః శం - మాకు శాంతినిచ్చుగాక! అభిష్టయే - ఇష్టములను సిద్ధింపజేయుగాక; పీతయే భవంతు - పానము చేయుటకు, రక్షణకు అగుగాక! నః శంయోః అభిస్రవంతు - మాకు రోగములు కలుగకుండునట్లుచేసి సుఖములను వర్షింపజేయుగాక!

ఓం ద్యౌః శాంతిరంతరిక్షగ్ం శాంతిః, పృథివీ శాంతి
**రాపః శాంతిరోషధయః శాంతిః, వనస్పతయః శాంతి**
**ర్విశ్వే దేవాః శాంతిర్బ్రహ్మ శాంతిః, సర్వగ్ం శాంతిః**
**శాంతిరేవ శాంతిః సా మా శాంతి రేధి.** (యజు. 36-17)

ద్యులోకము, అంతరిక్షము, భూమి, జలము, ఓషధులు, వనస్పతులు, ఎల్ల విద్వాంసులు, వేదము, సంపూర్ణ ప్రపంచము, స్వయముగా శాంతియై శాంతి నిచ్చు గాక! ఆ శాంతి నన్ను చేరి వర్ధిల్లుగాక!

ఓం **తచ్చక్షుర్దేవహితం పురస్తాచ్ఛుక్రముచ్చరత్**
**పశ్యేమ శరదః శతం జీవేమ శరదః శతగ్ం**
**శృణుయామ శరదః శతం ప్రబ్రవామ శరదః శత**
**మదీనాః స్యామ శరదః శతం భూయశ్చ శరదః శతాత్.** (య.36-24)

తత్ - బ్రహ్మ (పరమేశ్వరుడు), చక్షుః - సర్వద్రష్ట. దేవహితం - విద్వాంసులకు మేలుచేయువాడు! పురస్తాత్ - సృష్టికి పూర్వమున నుండు వాడు, శుక్రం ఉచ్చరత్ - శుద్ధుడై విలసిల్లుచుండును. అతని కృపవలన, శరదః శతం పశ్యేమ -నూఱు సంవత్సరములు బాగుగ చూతుముగాక......... జీవేమ - జీవింతుముగాక,.... ప్రబ్రవామ - బాగుగ మాటాడగలుగుదుము గాక.అదీనాః స్యామ - అదీనులమై - దీనులముకాక స్వతంత్రులమై యుందుముగాక, భూయశ్చ..... నూటికంటె ఎక్కువ సంవత్సరములుగూడ పరమేశ్వరుని కృపవలన సర్వవిధసుఖముల నందుదుముగాక!

ఓం **యజ్జాగ్రతో దూరముదైతి దైవమ్**
**తదు సుప్తస్య తథైవైతి**
**దూరంగమం జ్యోతిషాం జ్యోతిరేకం**
**తన్మే మనః శివసంకల్పమస్తు.** (య. 34-1) 20

**అర్థము** : యత్ - ఏది, దైవం - దివ్యగుణములుకలదో, జాగ్రతః - జాగ్రదవస్థలో, దూర ముదైతి - దూరముపోవునో, సుప్తస్య - నిద్రించు వాని మనస్సు, ఉతథా - అట్లే, ఏవ ఏతి - వెళ్ళునో, దూరంగమం - దూరము వెళ్ళునదియై, జ్యోతిషాం - ఇంద్రియజ్యోతులకు, జ్యోతిః - ప్రకాశకమునైన, తత్ - ఆ, మే మనః - నా మనస్సు, శివసంకల్పం - శుభసంకల్పములు కలది, అస్తు - అగుగాక!

**ఓం యేన కర్మాణ్యపసో మనీషిణో**
**యజ్ఞే కృణ్వంతి విదథేషు ధీరాః**
**యదపూర్వం యక్షమంతః ప్రజానామ్**
**తన్మే మనః శివసంకల్పమస్తు.** (య. 34-2) 21

**అర్థము** : - యేన - దేనిచే, అపసః - కర్మనిష్ఠులు, మనీషిణః - జ్ఞానులు, ధీరాః - బుద్ధిమంతులు, యజ్ఞే - యజ్ఞమునందు, విదథేషు - జ్ఞాన యజ్ఞములందును, కర్మాణి - కర్మలను, కృణ్వంతి - చేయుదురో, యత్ - ఏది, ప్రజానాం - ప్రజలయొక్క, అంతః - లోపల, అపూర్వం - విలక్షణమై యున్నదో, యక్షం - సంకల్పాదుల నొనర్చునో, తన్మే.........అస్తు - ఆ నా మనస్సు శుభ సంకల్పములు కలదియగుగాక!

**ఓం యత్ప్రజ్ఞానముత చేతో ధృతిశ్చ**
**యజ్జ్యోతిరంతరమృతం ప్రజాసు**
**యస్మాన్న ఋతే కిం చన కర్మ క్రియతే**
**తన్మే మనః శివసంకల్పమస్తు.** (య. 34-3) 22

**అర్థము**:- యత్ - ఏ మనస్సు, ప్రజ్ఞానం - జ్ఞానసాధనమో, ఉత - మఱియు, చేతః - విచారణశక్తిగలదో, ధృతిశ్చ - ధైర్యముగలదో, యత్ - ఏది, ప్రజాస్వంతః - ప్రజలలో, అమృతం - వినాశములేని, జ్యోతిః - ప్రకాశమో, యస్మాదృతే - ఏది లేకున్న, కించన కర్మ - ఏ కర్మయు, న క్రియతే - చేయబడదో, తన్మే....అస్తు - ఆ నా మనస్సు శివసంకల్పములుకలది యగుగాక!

ఓం యేనేదం భూతం భువనం భవిష్య
త్పరిగృహీతమమృతేన సర్వమ్
యేన యజ్ఞస్తాయతే సప్తహోతా
తన్మే మనః శివసంకల్పమస్తు. (య. 34-4) 23

అర్థము: - యేన అమృతేన - ఏ యమృతమనస్సు మూలమున, భూతం - గతించినట్టియు, భువనం - వర్తమానమును, భవిష్యత్ - రానున్నదియునగు, ఇదం సర్వం - ఇదియంతయు, పరిగృహీతం - గ్రహింపబడి యున్నదో, యేన - దేనిమూలమున; సప్తహోతా - సప్తహోతలుగల, యజ్ఞః తాయతే - యజ్ఞము చేయబడునో, తన్మే...అస్తు - ఆ నా మనస్సు శివసంకల్పము కలదియగుగాక!

ఓం యస్మిన్ ఋచః సామ యజూగ్ంషి
యస్మిన్ ప్రతిష్ఠితా రథనాభావివారాః
యస్మింశ్చిత్తగ్ం సర్వమోతం ప్రజానామ్
తన్మే మనః శివసంకల్పమస్తు. (య. 34-5) 24

అర్థము: యస్మిన్ - ఏ మనస్సులో, ఋచః - ఋక్కులు, సామ - సామము, యస్మిన్ - దేనియందు, యజూంషి - యజుస్సులు, ప్రతిష్ఠితాః - స్థితములై యున్నవో, రథనాభౌ - చక్రపుకుండలో, అరా ఇవ - చక్రపు టాకులవలె, యస్మిన్ - దేనియందు, ప్రజానామ్ - ప్రజలయొక్క, చిత్తం - చిత్తము, విచారశక్తి, సర్వం ఓతం - అంతయు నిమిడియున్నదో, తన్మే.... అస్తు - ఆ నా మనస్సు శుభసంకల్పము గలదియగుగాక!

ఓం సుషారథిరశ్వానివ యన్మనుష్యా
న్నేనీయతేఽభీషుభిర్వాజిన ఽఇవ
హృత్ప్రతిష్ఠం యదజిరం జవిష్ఠమ్
తన్మే మనః శివసంకల్పమస్తు. (య. 34-6) 25

అర్థము: ఇవ - ఏ విధముగ, సుషారథిః - మంచిసారథి, అభీషుభిః - కళ్ళెములతో, వాజినః - వేగవంతములగు, అశ్వాన్ - గుఱ్ఱములను, నేనీయతే

- నడపునో, యత్ మనుష్యాన్ - అట్లేది మనుజులను నడపునో, యత్ - ఏది, హృత్ ప్రతిష్ఠం - హృదయమున నుండునో, అజిరమ్ - మనుజులను వికలపఱచునో, జవిష్ఠమ్-ఎక్కువ వేగవంతమో, తన్మే.. అస్తు - ఆ నా మనస్సు శివసంకల్పముగలదియగుగాక!

**ఓం స నః పవస్వ శం గవే, శం జనాయ శమర్వతే**
**శం రాజ న్నోషధీభ్యః (సా 1-1-1-3) 26**

రాజన్ : ప్రకాశస్వరూప భగవన్! మాకు, మా గోవులకు, జనులకు, గుఱ్ఱములకు, ఓషధులకు శుభశాంతులను చేకూర్చుము.

**ఓం అభయం నః కరత్యంతరిక్ష**
**మభయం ద్యావాపృథివీ ఉభే ఇమే**
**అభయం పశ్చాదభయం పురస్తా**
**దుత్తరాదధరాదభయం నో అస్తు. (అథ. 19-15-5) 27**

ఓ పరమేశ్వర ! అంతరిక్షము, దివము, పృథివియన్నియు మమ్ములనభయులను జేయుగాక! మాకు ముందు వెనుకలనుండి కాని, క్రింద మీదులనుండి కాని యెటనుండియు భయము కలుగకుండుగాక!

**ఓం అభయం మిత్రాదభయమమిత్రా**
**దభయం జ్ఞాతాదభయం పరోక్షాత్**
**అభయం నక్తమభయం దివా నః**
**సర్వా ఆశా మమ మిత్రం భవంతు. (అథ. 19-15-6) 28**

ఓ ప్రభూ! మిత్రులు, శత్రువులు, ఎఱిగినవారు, పరోక్షముననున్న వారు - వీరిలో నెవరినుండియు మాకు భయము కలుగకుండుగాక! రాత్రి పగలు అను భేదము లేక ఎల్లవేళల మేము నిర్భయులమై యుండుముగాక! మాకు దిశలన్నియు మిత్రములగుగాక! ఏ దిక్కునుండియు మాకు భయమొదవ కుండుగాక!

ఇతి శాంతి ప్రకరణమ్

# ఆచమన మంత్రములు

ఉద్ధరిణెడు జలమును తన కుడిచేతిలో పోసికొని క్రింద వ్రాయబడిన మూడు మంత్రములను ఒక్కొక్కదానిని క్రమముగ నుచ్చరించుచు ముమ్మాఱు ఆచమింపవలయును.

**ఓం అమృతోపస్తరణమసి స్వాహా** (1. ఆచ.)

ఓంకారము పరమాత్ముని దివ్యనామములలో ముఖ్యతమము, అమృతః -= మృత్యువును తొలగించి సుఖము నొసగజాలు ఓ జలమా, ఉపస్తరణం= ప్రాణికోటికి ఆశ్రయ ప్రదాతవు, అసి = అగుచున్నావు. అను నాయీ కథనము, స్వాహా= సత్యార్థోపేతము అగుగాక!

**ఓం అమృతాపిధానమసి స్వాహా** (2. ఆచ.)

అమృత!= అమృతాత్మకమగు ఓ జలమా, అపిధానం = సకల జగత్తునకు జవసత్వముల నొసగి పోషించు దానవు, అసి = అగుచున్నావు.

**ఓం సత్యం యశః శ్రీర్మయి శ్రీః శ్రయతాం స్వాహా** (3. ఆచ.)

పరమేశ్వరా! మయి = నాయందు, సత్యం = సత్యము, యశః = కీర్తి, శ్రీః = శోభ, శ్రీః = లక్ష్మియు, శ్రయతాం = స్థిరముగ నివసించుగాక!

(అ.గృ. 1-24-22, 21,22.)

## అంగస్పర్శ మంత్రములు

ఆచమనానంతరము వామహస్తతలమున కొంచెము జలముంచుకొని కుడిచేతి అనామికతో మధ్యమాంగుళిని జోడించి ఆరెంటికొనలను వామ హస్తమునగల జలమున ముంచి ఈ క్రింది మంత్రముల నుచ్చరించుచు వరుసగ ముఖాద్యంగముల స్పృశింపవలయును.

**ఓం వాఙ్మ ఆస్యే஽స్తు** (పెదవులు స్పృశింపవలయును)

పరమాత్మా! మే = నాయొక్క, ఆస్యే = నోటియందు, వాక్ = వాగింద్రియము (మాటాడుశక్తి) అస్తు = స్థిరముగ నుండు గాక!

**ఓం నసోర్మే ప్రాణో஽స్తు** (నాసికాఛిద్రములను.... ను)

మే = నాయొక్క, నసోః = నాసికారంధ్రములయందు, ప్రాణః = ప్రాణ వాయువు (ఊపిరి పీల్చుకొనుశక్తి) అస్తు = స్థిరముగ నుండుగాక!

**ఓం అక్ష్ణోర్మే చక్షురస్తు** (నయన ద్వంద్వమును....ను)

మే = నాయొక్క, అక్ష్ణోః = నయనములందు, చక్షుః = చక్షురింద్రియము (చూడగలశక్తి) అస్తు = స్థిరముగా నుండుగాక!

**ఓం కర్ణయోర్మే శ్రోత్రమస్తు** ( చెవులను...ను)

మే = నాయొక్క, కర్ణయోః = శ్రుతిపుటములయందు, శ్రోత్రం = శ్రవణేంద్రియము (వినగలశక్తి), అస్తు = స్థిరముగా నుండుగాక!

**ఓం బాహ్వోర్మే బలమస్తు** (భుజములను...ను)

మే = నా యొక్క, బాహ్వోః = భుజములయందు, బలం = బలము, అస్తు = స్థిరముగ నుండుగాక!

**ఓం ఊర్వోర్మ ఓజోzస్తు** (ఊరువులను....ను)

మే = నాయొక్క, ఊర్వోః = తొడలయందు, ఓజః = పరాక్రమము, అస్తు = స్థిరముగ నుండుగాక!

**ఓం అరిష్టాని మేzఙాని తనూస్తన్వా మే సహ సంతు**

(శరీరమునం దంతట జలమును ప్రోక్షింపవలయును.)

మే = నాయొక్క, తనూః = శరీరము, మే = నాయొక్క, తన్వాసహ = శరీరముతో బాటు, అంగాని = అవయవములును, అరిష్టాని = నీరోగములు, సంతు = అగునుగాక!

(పా.గృ.1-3-25)

## అగ్న్యాధాన మంత్రము

పై నుడువబడిన క్రియ సక్రమముగ ముగిసిన పిదప దుర్గంధ రహితములు, పరిశుద్ధములు నగు ఎండు సమిధలను హవనకుండమున చక్కగ పేర్చి ఈ క్రింది మంత్రము నుచ్చరించుచు నేతిలో ముంచిన సమిధల రెంటిని గైకొని వెలిగింపవలయును, లేక కర్పూరముతో వెలిగింపవలయును.

**ఓం భూర్భువః స్వః** (గో.గృ.సూ 1-1-11)

ఓం = పరమాత్మ, భూః = సత్స్వరూపుడు, భువః = చిత్స్వరూపుడు, స్వః = ఆనందస్వరూపుడు.

(పై మూడు భగవంతుని పేర్లు. అతడు సచ్చిదానంద స్వరూపుడని ఆపేర్ల కర్థము)

పిదప నా వెలిగించిన యగ్నిని క్రింది మంత్రమును చదివి అగ్ని కుండమున నుంచవలయును.

**ఓం భూర్భువః స్వర్ద్యౌరివ భూమ్నా పృథివీవ వరిమ్ణా**
**తస్యాస్తే పృథివి దేవయజని**
**పృష్ఠేzగ్నిమన్నాదమన్నాద్యాయాదధే.** (యజు. 3-5)

దేవయజని = విద్వాంసులు యజ్ఞముచేయు, పృథివి! = ఓ పృథివీ+ (యజ్ఞకుండమా!), తస్యాః తే = ప్రసిద్ధమైన నీ యొక్క, పృష్ఠే = మధ్యలో, భూః భువః స్వః = భూలోకమునందు అంతరిక్షలోకమునందు స్వర్లోకము నందును, భూమ్నా ద్యౌరివ = మహిమచేత ద్యులోక సమానమును, వరిమ్ణా పృథివీవ = శ్రేష్ఠత్వముచేత పృథివీ సమానమును, అన్నాదం = హవ్యపదార్థములను సూక్ష్మీకరించునదియునగు, అగ్నిం = అగ్నిని, అన్నాద్యాయ = హవ్యపదార్థముల సూక్ష్మీకరించుటకొఱకు, ఆదధే = ఉంచుచున్నాను.

తా॥ యజ్ఞకుండమా! హవ్యపదార్థముల సూక్ష్మీకరించి సుగంధమును వ్యాప్తి చేయుటకుగాను అగ్నిని నీ మధ్యలో స్థాపించుచున్నాను.

## అగ్ని నుత్తేజింపజేయు మంత్రము

ఈ క్రింది మంత్రము నుచ్ఛరించుచు అగ్ని నుత్తేజింపజేయవలయును. ఇట్టితఱి విసనకఱ్ఱనే వాడవలయును. నోటితో నూదరాదు.

**ఓం ఉద్బుధ్యస్వాగ్నే, ప్రతిజాగృహి**
**త్వమిష్టాపూర్తే సగ్ం సృజేథా మయం చ,**
**అస్మిన్సధస్థే అధ్యుత్తరస్మిన్**
**విశ్వే దేవా యజమానశ్చ సీదత.** (య. 15-54)

అగ్నే! = అగ్నీ! నీవు, ఉద్బుధ్యస్వ = ప్రకాశించుము, ప్రతి జాగృహి = బాగుగ ప్రజ్వలించుము, అయం = ఈ యజమానుడు, త్వంచ = నీవును, ఇష్టాపూర్తే = యజ్ఞయాగముల చేయుట, వాపీకూప తటకారామాదుల నిర్మించుట మొదలగు సత్కార్యములను, సంసృజేథాం = సంపన్నము చేయుదురుగాక! అస్మిన్ = ఈ, సధస్థే = యజ్ఞశాలయందు, అధి+ఉత్తరస్మిన్ = ఇంతకంటె నుత్తమస్థానమందును, విశ్వే దేవాః = ఎల్ల విద్వాంసులు, యజమానః చ = యజమానుడును, సీదత = కూర్చుందురుగాక!

అగ్నిద్వారా హవిస్సోమ యజ్ఞములు నెఱవేఱునట్లును, యజ్ఞవేదికల యందు విద్వాంసులు, ఋత్విక్కులు, యజమానులు చేరి యజ్ఞకార్యముల చక్కగ నేఱవేర్చునట్లు పరమేశ్వరు డనుగ్రహించుగాక!

## సమిధాధాన మంత్రములు

అగ్ని సమిధలలో చొచ్చుకొని బాగుగ ప్రజ్వలింపసాగినపుడు మామిడి, మోదుగ, గంధము - వీనిలో వేనినైనను ఎనిమిది అంగుళములు పొడవుగల మూడు సమిధల నేరి వాని యగ్రభాగములను నేతిలో ముంచి క్రింది మంత్రములను పరిశుద్ధాంతఃకరణముతో పఠించుచు ఒక్కొక్కటిగా అగ్నికుండమున ఉంచవలయును.

**ఓం అయంత ఇధ్మ ఆత్మా జాతవేద**
**స్తేనేధ్యస్వ వర్ధస్వ చేద్ధ వర్ధయ చాస్మాన్**
**ప్రజయా పశుభిర్ బ్రహ్మవర్చసే**
**నాన్నాద్యేన సమేధయ - స్వాహా.**
**ఇదమగ్నయే జాతవేదసే ఇదం న మమ.**

**(అశ్వ. గృ. ప్రథ. అ.కం. 1. సూ. 12)**

అని మొదటి సమిధ నుంచవలయును.

జాతవేదః! = అగ్నీ! అయం ఇధ్మః = ఈ సమిధ, తే ఆత్మా = నీకు ఆధారము - దేహము, తేన = కావున దీనిచే, ఇద్ధస్వ = ప్రజ్వలించుము, చ = మమ్ముకూడ, ఇత్+హ = నిశ్చయముగ, ప్రజయా = సంతానముతోను,

పశుభిః = ధేన్వాది పశుగణముతోను, వర్ధయ = వృద్ధిపొందించుము, బ్రహ్మవర్చసేన = విద్యాబుద్ధులతో, అన్నాద్యేన = అన్నాది పదార్థములతోను, సమేధయ = కూర్చుము, స్వాహా = మాయీ కథనము సత్యోపేతమగును గాక! ఇదం = మాచే నీయబడు ఈ ఆహుతి, జాతవేదసే = ఉత్పన్న పదార్థములను ప్రకాశింపజేయు, అగ్నయే = అగ్నికొఱకు, న మమ = నా కొఱకు కాదు.

బాగుగా మండుటకు అగ్నిని నేతితో, సమిధలతో, హవ్యపదార్థములతో ప్రజ్వలింపజేయవలయును. ఈ యజ్ఞాగ్ని ఐహిక-ఆముష్మిక-అభ్యుదయమును కలిగించును.

**ఓం సమిధాగ్నిం దువస్యత, ఘృతైర్బోధయతాతిథిమ్,**
**ఆస్మిన్ హవ్యా జుహోతన.**
**ఓం సుసమిద్ధాయ శోచిషే, ఘృతం తీవ్రం జుహోతన,**
**అగ్నయే జాతవేదసే - స్వాహా.**
**ఇదమగ్నయే జాతవేదసే - ఇదం న మమ.** (యజు. అ.3.మం 1,2)
అని రెండవ సమిధ నుంచవలయును.

విద్వాంసులారా! మీరు శ్రద్ధాభక్తులతో, అతిథిం = అతిథినివలె, అగ్నిం = ఈ అగ్నిని, దువస్యత = సేవింపుడు, బోధయత = ప్రజ్వలింపజేయుడు, ఆ = అంతట, ఆస్మిన్ = ఈ యగ్నియందు, హవ్యా = హవనీయ పదార్థములను, జుహోతన = హోమము చేయుడు.

సు సమిద్ధాయ = మిక్కిలిగ ప్రదీప్త మొనరింపబడినదియు, శోచిషే = సర్వమును సంస్కరించునదియు, జాతవేదసే = ఉత్పన్న వస్తువుల ప్రకాశింపజేయునదియు నగు, అగ్నయే = అగ్నికి, ఘృతం = నేతిని, తీవ్రం = అధికముగా, జుహోతన = వ్రేల్చుడు. (మిగిలిన పదముల కర్థము పూర్వపు మంత్రమువలె చెప్పుకొనవలయును.)

నేతితో, సమిధలతో అగ్ని ప్రజ్వలితమగును. హవనీయమయిన అగ్నిని శ్రద్ధాభక్తులతో గౌరవింపదగిన అతిథినివలె ఘృతాదులతో సత్కరింపవలయును. ప్రకాశింపజేయవలయునని భావము.

ఓం **తంత్వా సమిద్భిరంగిరో, ఘృతేన వర్ధయామసి,**
**బృహచ్ఛోచా యవిష్ఠ్య - స్వాహా.**
**ఇదమగ్నయేzంగిరసే - ఇదం న మమ**
అని మూడవ సమిధ నాహుతింపవలయును.

అంగిరః = సమస్త బ్రహ్మాండమున వ్యాపించియున్న ఓయగ్నీ!, తం = (గార్హపత్య-ఆహవనీయ నామములతో) ప్రసిద్ధమగు, త్వా = నిన్ను, సమిద్భిః = సమిధలతో, ఘృతేన = నేతితోను, వర్ధయామసి = ప్రజ్వలింపజేయుదుము, యవిష్ఠ్య = పదార్థముల వేఱుచేయుటలో మిక్కిలి బలవంతుడవైన నీవు,బృహత్ = ఎక్కువగా, శోచ = ప్రకాశింపుము. (మిగిలిన పదములకు పూర్వము మాదిరి)

సకల పదార్థములలో నుండి వానిని వేఱుచేయుటలో మిక్కిలి శక్తి కలిగిన అగ్నిని సమిధలతోను, నేతితోను ఎక్కువగా మండునట్లు చేయవలయును.

## ఘృతాహుతి మంత్రము

ఈ క్రింది మంత్రమును 5సార్లు చదువుచు, 5 ఆహుతులను ఘృతముతో నియ్యవలయును.

ఓం **అయన్త ఇధ్మ ఆత్మా జాతవేద**
**స్తేనేధ్యస్వ వర్ధస్వ చేద్ధవర్ధయచాస్మాన్**
**ప్రజయా పశుభిర్బ్రహ్మవర్చసే**
**నాన్నాద్యేన సమేధయ - స్వాహా.**
**ఇదమగ్నయే జాతవేదసే - ఇదం న మమ**
(దీనియర్థ తాత్పర్యములు పూర్వము వ్రాయబడినవి.)

## జల ప్రసేచన మంత్రములు

ఓం **అదితేzనుమన్యస్వ.**

దక్షిణ హస్తముతో జలపాత్రము పట్టుకొని అగ్నికుండమునకు తూర్పుదిక్కున దక్షిణమునుండి ఉత్తరమునకు జలము పోయవలయును.

అదితే = కలిపియుంచు గుణముగల - సంయోగింపజేయు గుణము గల జలమా !, అనుమన్యస్వ = ఈ యజ్ఞాగ్నికి అనుకూలముగా నుండి తూర్పు దిశనుండి కాపాడుము.

**ఓం అనుమతేऽనుమన్యస్వ.**

పడమర దిక్కునందు దక్షిణమునుండి ఉత్తరమునకు జలము పోయవలయును.

అనుమతే = అనుకూలమైన జలమా! అనుమన్యస్వ = పశ్చిమ దిశనుండి అగ్నిని కాపాడుము.

**ఓం సరస్వత్యనుమన్యస్వ. (గో. గృ.1-3-1,2,3)**

ఉత్తర దిక్కునందు పడమరనుండి తూర్పునకు జలము పోయవలయును.

సరస్వతి = ప్రవహించుజలమా! అనుమన్యస్వ = ఉత్తరదిశ నుండి అగ్నిని కాపాడుము.

**ఓం దేవ సవితః ప్రసువ యజ్ఞం**
**ప్రసువ యజ్ఞపతిం భగాయ**
**దివ్యో గంధర్వః కేతపూః కేతం**
**నః పునాతు వాచస్పతిర్వాచం నః స్వదతు (య. 3-1)**

అగ్నికుండమునకు నలువైపుల జలము పోయవలయును.

సవితః దేవ! = ప్రేరణగుణముగల దేవా! దివ్యగుణములతో కూడిన జలము, యజ్ఞం = శుభకర్మమును, ప్రసువ = ప్రేరేపించును, దివ్యః = దివ్యశక్తులతోకూడి, గంధర్వః = భూమిని ధరించియున్న జలము, యజ్ఞపతిం = యజమానుని, భగాయ = ఐశ్వర్య ప్రాప్తి కొఱకు, ప్రసువ = ప్రేరణ చేయును, కేతపూః = శరీరమును పవిత్రముచేయు జలము, నః - మాయొక్క, కేతం - శరీరమును, పునాతు - పవిత్రముచేయుగాక! వాచస్పతిః - వాక్పతియయిన జలము, నః - మాయొక్క, వాచం - వాణిని, స్వదతు- మధురము చేయుగాక!

ప్రేరణ గుణముగల దేవా! మాకొఱకు యజ్ఞమును ప్రేరేపింతువుగాక! దివ్యగుణములు గలిగి భూమిని ధరించియున్న జలము యజమానుని ఐశ్వర్య ప్రాప్తి కొఱకు ప్రేరణచేయుగాక! శరీరములను పవిత్రముచేయు జలము మా శరీరమును పవిత్రము చేయుగాక! వాక్పతియైన జలము మా వాక్కును మధురము చేయునుగాక!

## ఆఘూరావాజ్యభాగాహుతి మంత్రములు

ఓం **అగ్నయే స్వాహా**

**ఇద మగ్న యే - ఇదం న మమ.** (యజు. 22-27)

అగ్నికుండములో ఉత్తరపువైపున నేతిని వేయవలయును.

ఓం - హే రక్షకా!, అగ్నయే - ప్రకాశస్వరూపుడైన అగ్నికొఱకు, స్వాహా- ఈ నేతి నాహుతిగా నిచ్చుచున్నాను.

ఓం **సోమాయ స్వాహా,**

**ఇదం సోమాయ - ఇదం న మమ (యజు. 22-28)**

నేతిని అగ్నికుండములో దక్షిణపు వైపున వేయవలయును.

సోమాయ - శాంతిదాయకమైన అగ్నికొఱకు, స్వాహా - ఈ ఆహుతి నిచ్చుచున్నాను.

ఓం **ప్రజాపతయే స్వాహా,**

**ఇదం ప్రజాపతయే - ఇదం న మమ** (యజు. 18-27)

నేతిని అగ్నికుండమున మధ్యలో వేయవలయును.

ప్రజాపతయే - ప్రజాపతియైన అగ్నికొఱకు, స్వాహా - ఈ అహుతి నిచ్చుచున్నాను.

ఓం **ఇంద్రాయ స్వాహా,**

**ఇదమింద్రాయ - ఇదం న మమ.** (యజు. 22-28)

ఇంద్రాయ - శ్రేష్ఠమైన అగ్నికొఱకు, స్వాహా - ఈ ఆహుతి నిచ్చుచున్నాను.

## వ్యాహృత్యాహుతి మంత్రములు

**ఓం భూరగ్నయే స్వాహా**

**ఇదమగ్నయే - ఇదం న మమ**

భూః అగ్నయే - భూమియందుండు ప్రాణస్వరూపమైన అగ్ని కొఱకు, స్వాహా - ఆహుతి నిచ్చుచున్నాను.

**ఓం భువర్వాయవే స్వాహా,**

**ఇదం వాయవే - ఇదం న మమ.**

భువః వాయవే - అంతరిక్షమున నుండు వాయువు కొఱకు, స్వాహా - ఆహుతి నిచ్చుచున్నాను.

**ఓం స్వరాదిత్యాయ స్వాహా,**

**ఇదమాదిత్యాయ - ఇదం న మమ.**

స్వః ఆదిత్యాయ - ద్యులోకముననుండు సూర్యునికొఱకు, స్వాహా - ఆహుతి నిచ్చుచున్నాను.

**ఓం భూర్భువః స్వరగ్నివాయ్వాదిత్యేభ్యః స్వాహా,**

**ఇదమగ్నివాయ్వాదిత్యేభ్యః - ఇదం న మమ.**

**(పార. కా. 1. కం. 5. సూ, 3.4)**

భూర్భువ.....భ్యః - భూమ్యంతరిక్షలోకములం దుండు అగ్ని వా య్వాదిత్యులకొఱకు, స్వాహా - ఆహుతుల నిచ్చుచున్నాను.

## స్విష్టకృదాహుతి మంత్రము

(ప్రాయశ్చిత్తాహుతి మంత్రము)

ఘృతముతో 'వ్యాహృత్యాహుతుల' నిచ్చిన పిదప మరల ఘృతము తోను, మిష్టాన్నముతోను, "స్విష్టకృదాహుతి" నొకదానిని నీయవలయును.

**ఓం యదస్య కర్మణోఽత్యరీరిచమ్, యద్వా**
**న్యూనమిహాకరమ్, అగ్నిష్టత్స్విష్టకృద్విద్యా**
**త్సర్వం స్విష్టం సుహుతం కరోతు మే.**

**అగ్నయే స్విష్టకృతే సుహుతహుతే**
**సర్వప్రాయశ్చిత్తాహుతీనాం కామానామ్**
**సమర్ధయిత్రే, సర్వాన్నః కామాన్సమర్ధయ - స్వాహా,**
**ఇదమగ్నయే స్విష్టకృతే - ఇదం న మమ**
**(శత. కా 14 - అ8. ప్ర 7. క. 5)**

అస్య కర్మణః - ఈ యజ్ఞకర్మయందు, యత్ - ఏది, అత్యరీరిచం - విధికంటె అధికము చేయబడినదో - యద్వా - లేక, ఇహ- ఈ యజ్ఞ కర్మయందు, న్యూనం అకరం - తక్కువ చేయబడినదో, తత్ - అది అనగా ఆ యెక్కువ తక్కువలను, అగ్నిః - ప్రకాశస్వరూపుడగు పరమాత్మ! స్విష్టకృత్ - బాగుగా చేయబడినట్లు, విద్యాత్ - తెలిసికొనుగాక! అంగీకరించుగాక! మఱియు, మే - నా యొక్క యజ్ఞము, సర్వం - అంతయు, స్విష్టం - బాగుగా చేయబడునట్లు, సుహుతం - బాగుగా ఆహుతులనిచ్చి చేయబడునట్లును, కరోతు - చేయుగాక!, స్విష్టకృతే - శోభన యజ్ఞ సంపాదకుడు, సుహుతహుతే- సుహుత పదార్ధమును గ్రహించువాడు, కామానాం - అభీష్టములయిన, సర్వప్రాయశ్చిత్తా హుతీనాం - (దురాలోచనల దూరీకరించి సద్విచారములను హృదయకుహరముల ప్రవేశ పెట్టజాలు) ప్రాయశ్చిత్తాహుతులను, సమర్ధయిత్రే - పెంపొందింపజాలు వాడును అగు, అగ్నయే - పరమాత్మకొఱకు, నాయీ ఆహుతి సుహుతమగుగాక! పరమేశ్వరా!, నః - మాయొక్క, సర్వాన్ కామాన్ - సమస్తమైన కోరికలను, సమర్ధయ - సిద్ధింపజేయుము, స్వాహా - ఈ నా వాక్కు సత్యమగుగాక!

హే ప్రభూ! నేను అజ్ఞానమువలన ఈ యజ్ఞమునందు విధికి వ్యతిరేకముగా చేసిన యెక్కువ తక్కువలను క్షమించి, యథావిధి చేసినట్లే అంగీకరింతువు గాక! ప్రాయశ్చిత్తాహుతి మూలమున సర్వకామముల నీ డేర్చు నీకు ఈ ఆహుతి నిచ్చుచున్నాను. మా కోర్కెలన్నిటిని పూర్ణము చేయుదువుగాక!

## ప్రజాపత్యాహుతి

ఓం ప్రజాపతయే స్వాహా,
ఇదం ప్రజాపతయే - ఇదం న మమ (పా. గృ.1-11-3)

ప్రజాపతయే - ప్రజాపాలకుడగు పరమాత్మ కొఱకు, స్వాహా - ఈ ఆహుతి నిచ్చుచున్నాను. ( ఈ మంత్రము పెద్దగా అనరాదు)

## ప్రధానహోమ మంత్రములు

ప్రజాపత్యాహుతి నిచ్చిన పిదప నిమ్నలిఖిత మంత్రముల నుచ్చరించుచు క్రమముగ నాలుగు ఘృతాహుతుల నీయవలయును. (ఇవి చౌల, వైవాహిక, సమావర్తన సంస్కారములందు మిక్కిలి ప్రాముఖ్యము గలవి)

ఓం భూర్భువః స్వః,
అగ్న ఆయూంషి పవస ఆ సువోర్జమిషం చ నః,
ఆరే బాధస్వ దుచ్ఛునామ్ స్వాహా,
ఇదమగ్నయే పవమానాయ - ఇదం న మమ.

ఓం - రక్షకుడవు, భూః - ప్రాణస్వరూపుడవు, భువః - దుఃఖనాశకుడవు, స్వః - సుఖదాయకుడవు - అయిన, అగ్నే - ప్రకాశ స్వరూప పరమాత్మా!, ఆయూంషి - ప్రాణములను (జీవనములను) పవసే - రక్షించుచున్నావు. చ - మఱియు, నః - మాకు, ఊర్జం - బలమును. ఇషం - అన్నమును, ఆసువ - కలిగించుము, దుచ్ఛునాం - దుర్విచారములను, ఆరేబాధస్వ - మాకు దూరము చేసి నశింపజేయుము, స్వాహా - ఇందులకై ఈ ఆహుతి నిచ్చుచున్నాను, ఇదం - ఈ ఆహుతి, పవమానాయ అగ్నయే - పవిత్రమొనర్చు అగ్నికొఱకు, న మమ - నాకు గాదు.

హే రక్షక! నీవు ప్రాణప్రియుడవు, దుఃఖనాశకుడవు, సుఖదాయకుడవు, హే ప్రకాశస్వరూపదేవా! మా జీవితములను రక్షించుము. మాకు బలమును, అన్నాదిభోగ్య పదార్థములను చేకూర్చుము, మాలోని దుర్వ్యసనములను నశింపజేయుము.

**ఓం భూర్భువః స్వః**

**అగ్నిర్ ఋషిః పవమానః పాంచజన్యః పురోహితః,**

**తమీమహే మహాగయం స్వాహా,**

**ఇదమగ్నయే పవమానాయ - ఇదం న మమ.**

పరమాత్మ, అగ్నిః - తేజోమయుడు, ఋషిః - సర్వవ్యాపకుడు, పవమానః - పవిత్రుడు, పాంచజన్యః - పంచజనులకు హిత మొనర్చువాడు, పురోహితః - సృష్టికి పూర్వమునుండియు ఉండి హితమొనర్చువాడు నై యున్నాడు, మహాగయం - విద్వాంసులచే స్తుతింపదగిన, తం - అట్టి పరమేశ్వరుని, ఈ మహే - ధనాది సకలైశ్వర్యములను యాచింతుము, స్వాహా - ఈ భావనతో నాహుతి నిచ్చుచున్నాను.

పంచజనులు: 1 బ్రాహ్మణ 2 క్షత్రియ 3 వైశ్య 4 శూద్ర 5 ఇతరులు - అనగా వేదము నంగీకరింపనివారు)

పరమాత్మ రక్షకుడు, ప్రాణస్వరూపుడు, దుఃఖనాశకుడు, సుఖ దాయకుడు, తేజోమయుడు, సర్వవ్యాపకుడు, పవిత్రుడు, పంచజనులకు హిత మొనర్చువాడు, సృష్టికి పూర్వమునుండియు ఉండి హితమొనర్చువాడును అయియున్నాడు, అట్టి పరమాత్మనుధనాదిసకలైశ్వర్యములకై యాచింతుము.

**ఓం భూర్భువః స్వః**

**అగ్నే పవస్వ స్వపా అస్మే వర్చః సువీర్యం,**

**దధద్రయిం మయి పోషం స్వాహా,**

**ఇదమగ్నయే పవమానాయ - ఇదం న మమ.**

**(ఋ. మం9. సూ 66. మం 19,20,21)**

అగ్నే! - ప్రకాశస్వరూప ప్రభూ!, స్వపాః - ఉత్తమకర్మల నొనర్చు ప్రజలను, పవస్వ - పవిత్రముచేయుము, అస్మే - నా కొఱకు, వర్చః - తేజస్సును, సువీర్యం - మంచి పరాక్రమమును, దధత్ - కలిగించుము, మయి - నాయందు, రయిం - జ్ఞానాదిధనమును, పోషం-పుష్టిని, దధత్ - కలిగించుము, స్వాహా - ఇందులకై ఈ ఆహుతి నిచ్చుచున్నాను.

హే ప్రకాశస్వరూప ప్రభూ! ఉత్తమ కర్మలొనర్చు ప్రజలను పవిత్రము చేయుము. నాకు తేజస్సు, ధనము, పరాక్రమము, పుష్టి, కలుగునట్లు అనుగ్రహింపుము.

ఓం భూర్భువః స్వః, ప్రజాపతే న త్వదేతా
న్యన్యో విశ్వా జాతాని పరి తా బభూవ,
యత్కామాస్తే జుహుమస్తన్నో అస్తు
వయం స్యామ పతయో రయీణామ్ స్వాహా,
ఇదం ప్రజాపతయే - ఇదం న మమ. (ఋ, మం 10, సూ 121. మం 10)

ప్రజాపతే! - ఓ స్వామీ! త్వత్ - నీ కంటె ఇతరుడు, తా ఏతాని విశ్వాజాతాని - ఆ ఈ సమస్త పదార్థములను, న పరిబభూవ - ఉత్పన్నము చేయజాలడు, యత్ కామాః - ఏ కోరికలు గలిగిమేము, తే - నీకు, జుహుమః - ఆత్మసమర్పణము చేయుచున్నామో, తత్ - ఆ కోరికలు, నః - మాకు, అస్తు - సఫలమగుగాక! వయం - మేము, రయీణాం - విజ్ఞానాద్యైశ్వర్యములకు, పతయః స్యామ - స్వాములము అగుదుము గాకః!

ఓ జగత్పతీ! నీవు కాక యితరులెవరును ఈ సృష్టిగత పదార్థములను సృష్టింపజాలరు. కామితముల నెఱవేర్చు ఓ స్వామీ! ఏయే కోరికలతో పురుషార్థమొనర్చి మమ్ము మేము నీకు అర్పించుచున్నామో ఆయా కోరికలు మాకు పూర్ణములగు గాక! మేము విజ్ఞానాది ధనములకధిపతుల మగుదుము గాక!

## అష్టాజ్యాహుతి మంత్రములు

ఓం త్వంనో అగ్నే వరుణస్య విద్వాన్
దేవస్య హేడోఽవయాసిసీష్ఠాః,
యజిష్ఠో వహ్నితమః శోశుచానో
విశ్వా ద్వేషాంసి ప్రముముగ్ధ్యస్మత్ స్వాహా,
ఇదమగ్నీవరుణాభ్యాం - ఇదం న మమ. (ఋ .మం. 4. సూ1 .4)
(పార. కా 1. క. 2. సూ 8)

అగ్నే! ఓ ప్రకాశస్వరూప ప్రభూ!, త్వం - నీవు , నః - మాలోని, వరుణస్య - ఉత్తమ గుణవంతుడైన, దేవస్య - విద్వాంసుని, విద్వాన్ - ఎఱుగుదువు. కాన అట్టివాని యొక్క, హేడః - క్రోధమును - అయ యాసిసీష్ఠాః - దూరము చేయుము, యజిష్ఠః - యజ్ఞాది శుభకర్మలొనర్చుటలో నుత్తముడనైన నేను, వహ్నితమః - కార్యభారము వహించుటలో సమర్థుడను; శోశుచానః - మిక్కిలి తేజస్సు గలవాడను అగుదును గాక!, విశ్వా - సమస్తమైన, ద్వేషాంసి - పాపహేతువులగు దుర్గుణములను, అస్మత్ - మానుండి , ప్రముముగ్ధి - మిక్కిలి దూరము చేయుము, స్వాహా - ఈ భావనతో నాహుతి నిచ్చుచున్నాను, ఇదం - ఈ ఆహుతి, అగ్నీ వరుణాభ్యాం - అగ్నీ వరుణులకొఱకు, ఇదం - ఈ అహుతి, న మమ - నాకు కాదు.

పరమాత్మా! మాలో గుణవంతులగు విద్వాంసుల నెఱుగుదువు. అట్టివారి క్రోధమును తొలగించుము, నేను యజ్ఞాది శుభకర్మ లొనర్చుచు కార్యభారము వహించుటలో సమర్థుడను తేజోవంతుడను అగుదునుగాక! పాపహేతువులగు దుర్గుణములను మానుండి తొలగించుము. ఈ యాహుతి నిందులకే యిచ్చుచున్నాను.

**ఓం స త్వంనో అగ్నేzవమో భవోతీ**
**నేదిష్ఠో అస్యా ఉషసో వ్యుష్టౌ,**
**అవయక్ష్వ నో వరుణం రరాణో**
**వీహి మృళీకం సుహవో న ఏధి స్వాహా,**
**ఇదమగ్నీవరుణాభ్యాం - ఇదం న మమ.**

**(ఋ. మం 4. సూ 1. 5)**

అగ్నే! - ప్రకాశస్వరూప ప్రభూ!, సః త్వం - ప్రసిద్ధుడవగు నీవు, నః - మాకు, అవమః - రక్షకుడవు, భవ - కమ్ము ఊతీ - రక్షణద్వారా, నేదిష్ఠః - సమీపములో నుండువాడవు, భవ - కమ్ము, అస్యాః ఉషసః - ఈ ప్రాతః కాలము యొక్క, వ్యుష్టౌ - ప్రకాశము నందు, నః - మమ్ములను, వరుణం - ఆవరించు దుఃఖములను, అవయక్ష్వ - దూరము చేయుము, రరాణః - మాచే

ప్రార్థింపబడినవాడవై నీవు, మృడీకం - సుఖమును, వీహి - కలిగింపుము, నః - మాకు, సుహవః సులభముగ నాహ్వానింపదగినవాడవు, ఏధి - కమ్ము, స్వాహా - ఈ భావనతో నాహుతి, నిచ్చుచున్నాను.

ఓ ప్రకాశస్వరూప ప్రభూ! నీవు మాకు రక్షకుడవు, సమీపస్థుడవు కమ్ము. ఈ ఉషఃకాలమునందు మమ్మావరించు దుఃఖములను నాశనము చేయుము. సుఖమును కలిగించుము. మాకు సులభముగ నాహ్వానింప దగినవాడవు కమ్ము, ఈ యాహుతి నిందులకే యిచ్చుచున్నాను.

**ఓం ఇమం మే వరుణ శ్రుధీ హవమద్యా చ**
**మృళయ, త్వామవస్యురాచకే స్వాహా.**
**ఇదం వరుణాయ - ఇదం న మమ.** (ఋ. మం 1 సూ 25. మం. 19)

వరుణ: - ప్రశంసనీయుడవగు నో ప్రభూ, మే - నాయొక్క, ఇమం హవం - ఈ పిలుపును, శ్రుధి - వినుము, చ - మఱియు, అద్యా - ఇప్పుడే, మృళయ - మమ్ము సుఖింపజేయుము, అవస్యుః - రక్షణ కోరునట్టి నేను, త్వాం - నిన్ను, ఆచకే - శుభాచరణ ద్వారా ప్రసన్నుని జేయుదును, స్వాహా - ఈ భావనతో నాహుతి నిచ్చుచున్నాను.

హే పరమేశ్వర! సంసారబంధనమున చిక్కుకొని యున్న నా పిలుపును విదినవెంటనే దుఃఖములను తొలగించి నాకు సుఖమును కలిగించుము. ఆపదలనుండి రక్షణకోరు నేను శుభకర్మల నాచరించి సదాచారముతో నిన్ను ప్రసన్నునిగా జేయుదును.

**ఓం తత్వా యామి బ్రహ్మణా వందమాన**
**స్తదాశాస్తే యజమానో హవిర్భిః,**
**అహేళమానో వరుణేహ బోధ్యు**
**రుశంస మా న ఆయుః ప్రమోషీః స్వాహా**
**ఇదం వరుణాయ - ఇదం న మమ.** (ఋ, మం. 1. సూ 24. మం 11)

వరుణః- జగదీశ్వర! బ్రహ్మణా - వేదవాణి ద్వారా, వందమానః - స్తుతించుచున్న వాడనై, తత్ త్వా - ప్రసిద్ధుడవగు నిన్ను, యామి -

పొందుచున్నాను, యజమానః - యజ్ఞముచేయు నేను, హవిర్భిః - హవ్యద్రవ్యములతో, తత్ - నీ శరణ్యమును, ఆశాస్తే - పొందగోరుచున్నాను, అహేడమానః - మమ్ము నిరాకరింపనివాడవై, ఇహ - ఈ యజ్ఞకర్మయందు, బోధి - మా వాంఛ నెఱుంగుము, హే ఉరుశంస:- పలువురిచే స్తుతింపదగినవాడా! నః ఆయుః - మా జీవనమును - జీవిత పరిమాణమును, మా ప్రమోషీః - హరింపకుము, స్వాహా - ఈ బావనతో నాహుతి నిచ్చుచున్నాను.

హే జగదీశ్వర ! వేదవాక్కులద్వారా నిన్ను స్తుతించుచు నీ శరణు జొచ్చుచున్నాను. నేను ఈ శుభకర్మల నాచరించుచు నిన్ను ప్రార్థించుచున్నాను, నా ప్రార్థన త్రోసి పుచ్చక మా వాంఛ నెఱుంగుము. నా జీవనమును హరింపకుము, పూర్ణ - అయువును పొంది శుభకర్మల ద్వారా నా జీవితమును సఫలము చేసికొందును.

**ఓం యే తే శతం వరుణ యే సహస్రమ్**
**యజ్ఞియాః పాశా వితతా మహాన్తః**
**తేభిర్నోzద్య సవితోత విష్ణుర్విశ్వే**
**ముంచంతు మరుతః స్వర్కాః స్వాహా,**
**ఇదం వరుణాయ సవిత్రే విష్ణవే విశ్వేభ్యో**
**దేవేభ్యో మరుద్భ్యః స్వర్కేభ్యః - ఇదం న మమ. (కాత్యా. శౌ. 25-1-11)**

హే వరుణ!, - ఓ జగదీశ్వర!, తే - ప్రసిద్ధమగు, యే శతం - ఏ వందలకొలది, యే సహస్రం - ఏ వేలకొలది, మహాంతః - గొప్పవియైన, యజ్ఞియాః - యజ్ఞమునకు సంబంధించిన , పాశాః - ప్రతిబంధకములు, వితతాః - సర్వత్ర వ్యాపించియున్నవో, తేభిః - వానినుండి, అద్య - ఇప్పుడు, నః - మమ్ములను, సవితా - సర్వోత్పాదకుడవు, విష్ణుః - సర్వ వ్యాపకుడవునగు నీవు, ఉత - మఱియు, స్వర్కా ః - పూజ్యులగు, విశ్వేమరుత ః- సమస్త విద్వాంసులు, ముంచంతు - విడిపింతురుగాక!

జగదీశ్వర! యజ్ఞమునకు సంబంధించిన ప్రతిబంధకము లనేకము వందల కొలది వేలకొలది కలవు. నీ యనుగ్రహముతో పండితులు వాని నుండి మమ్ము విడిపింతురుగాక!

**ఓం అయాశ్చాగ్నే అస్యనభిశస్తి -**
**పాశ్చ సత్యమిత్త్వమయాసి,**
**అయా నో యజ్ఞం వహాస్యయా**
**నో ధేహి భేషజగ్ం స్వాహా,**
**ఇద మగ్నయే అయసే - ఇదం న మమ.** (కాత్యా. శ్రౌ. 15-1-11)

అగ్నే! - ప్రకాశస్వరూప ప్రభూ!, అయాః - సర్వవ్యాపకుడవు, అసి - అయిఉన్నావు, చ - మఱియు, హే అనభిశస్తి, పాః! - కామక్రోధాది శత్రువుల నుండి రక్షించు ప్రభూ!, త్వ ఇత్ - నీవే, సత్యం - యథార్థముగా; అయాఃఅసి - సర్వ వ్యాపకుడవు, అయాః - నీవు వ్యాపకుడవగుటవలననే, నః - మా యొక్క, యజ్ఞం - యజ్ఞమును, వహాసి - పూర్ణము చేయుటకు తోడ్పడుచున్నావు, అయాః - వ్యాపకుడవైయుండి, నః - మాకు, భేషజం - కామక్రోధాదుల నణచుశక్తిని, ధేహి - ఇమ్ము.

ప్రభూ! నీవు సర్వ వ్యాపకుడవు, కామక్రోధాది - అంతః శత్రువులను అణచుటకు తోడ్పడి మమ్ము రక్షించుచుందువు. మా యజ్ఞము సంపన్న మగుటకు తోడ్పడుము. మా అంతఃశత్రువుల జయించు శక్తిని మాకు ప్రసాదింతువు గాక!

**ఓం ఉదుత్తమం వరుణ పాశమస్మ**
**దవాధమం వి మధ్యమం శ్రథాయ,**
**అథా వయమాదిత్య వ్రతే తవానాగసో**
**అదితయే స్యామ స్వాహా,**
**ఇదం వరుణాయాదిత్యాయాదితయే చ-**
**ఇదం న మమ** (ఋ. మం. 1. సూ 24. మం 15)

వరుణ - పరమేశ్వరా!, అస్మత్ - మానుండి , అధమం మధ్యమం ఉత్ ఉత్తమం - అధమ శ్రేణికి మధ్యమ శ్రేణికి మఱియు నుత్తమ శ్రేణికి చెందిన,

పాశం - బంధనమును, వ్యవశ్రధాయ - భగ్న మొనరింపుము. అథా - మఱియు, అదిత్య - నాశరహితుడవగు నో పరమేశ్వర, తవ - నీ యొక్క, వ్రతే-అజ్ఞారూప వ్రతమందున్న, వయం - మేము, అనాగసః - పాప రహితులమయి, అదితయే - అఖండానంద ప్రాప్తికి, స్యామ - అర్హుల మగుదుము గాక!

పరమేశ్వరా, అన్ని విధముల బంధనములనుండి మమ్ము విడిపింపుము, పాప రహితులమయి మేము నీ యాజ్ఞల పాలించుచుఅఖండానంద ప్రాప్తికి అర్హుల మగునట్లు అనుగ్రహింపుము.

**ఓం భవతం నః సమనసౌ సచేతసావరేపసౌ**
**మా యజ్ఞగ్ం హిగ్ంసిష్టమ్, మా యజ్ఞపతిం**
**జాతవేదసౌ శివౌ భవతమద్య నః స్వాహా,**
**ఇదం జాతవేదోభ్యాం - ఇదం న మమ.** (యజు. అ 5. మం. 3.)

ఓం - హే రక్షక!, నః - మాలో, అరేపసౌ - పాపరహితులు, సమనసౌ - పరస్పర సహాయకులు, సచేతసౌ - సమాన బుద్ధిగలవారు నగు స్త్రీ పురుషులు, భవతమ్ - జన్మింతురుగాక! వారు, జాత వేదసే - వేదజ్ఞానము గలవారై, యజ్ఞం - యజ్ఞమును, యజ్ఞపతిం - యజమానుని, మా హింసిష్టమ్ - హింసింపకుందురుగాక! అద్య - ఇప్పుడు, యజ్ఞసమయమున, ఇట్టి స్త్రీ పురుషులే, నః - మాకు, శివౌ - మేలు చేయువారు, భవతమ్ - అయ్యెదరుగాక! ఇదం - ఇది, జాతవేదోభ్యాం - వేదజ్ఞానముగల స్త్రీ పురుషుల కొఱకు, న మమ - నాకు కాదు.

పరమేశ్వరా ! మాలో పాపరహితులు, సమానజ్ఞానులు నై పరస్పరము సాహాయ్యము చేసికొను స్త్రీ పురుషులు జన్మింతురుగాక! వారు వేదవిదులై యజ్ఞమును యజ్ఞపతిని హింసింపకుందురుగాక! మా కీ యజ్ఞములో నట్టి స్త్రీ పురుషులు తోడ్పడుదురుగాక!

## ప్రాతఃకాల హవన మంత్రములు

**ఓం సూర్యో జ్యోతిర్జ్యోతిః సూర్యః స్వాహా,**
**ఓం సూర్యో వర్చో జ్యోతిర్వర్చః స్వాహా,**
**ఓం జ్యోతిః సూర్యః సూర్యో జ్యోతిః స్వాహా,**
**ఓం సజూర్దేవేన సవిత్రా సజూరుషసేంద్రవత్యా**
**జుషాణః సూర్యో వేతు స్వాహా.** (యజు. 3-9)

ఇట మొదటి మూడు పాదములకు - 'జ్యోతిస్స్వరూపుడు, వర్చస్స్వరూపుడు నగు సూర్యుని కొఱకు ఈ ఆహుతి నిచ్చుచున్నాను. -" అని యర్థము గ్రహింపవలయును.

తుది రెండు పాదములకు అర్థము :- దేవేన సవిత్రా - సర్వప్రకాశకుడు సర్వాంతర్యామియు నగు ఈశ్వరునిచే సృష్టింపబడిన జగత్తుతో కూడ, సజూః - సమానముగ వర్తమానుడై యుండి, ఇంద్రవత్యా - ప్రకాశవంతమగు, ఉషసా జుషాణః - ప్రాతఃకాలముతో కూడినవాడై, వేతు - అంతట ప్రకాశించు, సూర్యః - సూర్యుని కొఱకు, స్వాహా - ఈ ఆహుతి నిచ్చుచున్నాను.

## సాయంకాల హవన మంత్రములు

**ఓం అగ్నిర్జ్యోతిర్జ్యోతిరగ్నిః స్వాహా,**
**ఓం అగ్నిర్వర్చో జ్యోతిర్వర్చః స్వాహా,**
**(ఓం అగ్నిర్జ్యోతి ర్జ్యోతి రగ్నిః స్వాహా) ఇది పెద్దగ అనరాదు**
**ఓం సజూ ర్దేవేన సవిత్రా సజూ రాత్ర్యేంద్రవత్యా**
**జుషాణో అగ్నిర్వేతు స్వాహా.** (యజు. 3-10)

ఇట మొదటి మూడు పాదములకు - "జ్యోతిస్స్వరూపము, వర్చస్స్వరూపము నైన అగ్ని కొఱకు ఈ ఆహుతి నిచ్చుచున్నాను." అని యర్థము గ్రహింపవలయును.

తుది రెండు పాదముల కర్థము:- దేవేన సవిత్రా - సర్వజగద్ద్యోతకుడు సర్వజగదుత్పాదకుడునైన ఈశ్వరునిచే సృష్టింపబడిన జగత్తుతో కూడ, సజూః - సమానముగ వర్తమానమై యుండి, ఇంద్రవత్యా- విద్యుచ్ఛక్తితో కూడినదై,

రాత్ర్యాజుషాణః - అంధకార రూపరాత్రితో పాటు, వేతు - అంతట వ్యాపించియుండు, అగ్నిః - అగ్నికొఱకు, స్వాహా - ఈ ఆహుతి నిచ్చుచున్నాను.

## ప్రాతస్సాయం సమయముల హవన మంత్రములు

ఓం భూరగ్నయే ప్రాణాయ స్వాహా,
ఇదమగ్నయే ప్రాణాయ - ఇదం న మమ.

ఓం భువర్వాయవే అపానాయ స్వాహా
ఇదం వాయవే అపానాయ - ఇదం న మమ.

ఓం స్వరాదిత్యాయ వ్యానాయ స్వాహా,
ఇదమాదిత్యాయ వ్యానాయ - ఇదం న మమ.

ఓం భూర్భువః స్వరగ్నివాయ్వాదిత్యేభ్యః
ప్రాణాపానవ్యానేభ్యః స్వాహా,
ఇదమగ్నివాయ్వాదిత్యేభ్యః
ప్రాణాపానవ్యానేభ్యః - ఇదం న మమ.

(1) ప్రాణాయ - ప్రాణమువంటిదగు, భూః అగ్నయే - భూమి యందుండు అగ్ని కొఱకు, స్వాహా, - ఆహుతి నిచ్చుచున్నాను.

(2) అపానాయ - దుఃఖములను తొలగించు, భువః వాయవే - అంతరిక్షముననుండు వాయువు కొఱకు, స్వాహా - ఆహుతి నిచ్చు చున్నాను

(3) వ్యానాయ - సుఖమునిచ్చు, స్వః ఆదిత్యాయ - ద్యులోకము నందుండు సూర్యుని కొఱకు, స్వాహా - ఆహుతి నిచ్చుచున్నాను.

(4) ప్రాణాపానవ్యానేభ్యః - ప్రాణాపానవ్యానరూపములైన, భూః భువః స్వః - భూమి - అంతరిక్ష - ద్యులోకము లందుండు, అగ్ని వాయ్వాదిత్యేభ్య ః - అగ్ని వాయు సూర్యులకొఱకు, స్వాహా - ఆహుతి నిచ్చుచున్నాను.

ఓం **ఆపో జ్యోతీరసోऽమృతం బ్రహ్మ భూర్భువః స్వరోం స్వాహా,**
పరమేశ్వరా! నీవు, ఆపః - అంతటనుండు వాడవు, జ్యోతిః - ప్రకాశ స్వరూపుడవు, రసః- ప్రేమస్వరూపుడవు, అమృతం - నాశ రహితుడవు, బ్రహ్మ - అన్నిటికంటె గొప్పవాడవు, భూః - ప్రాణము వంటివాడవు, భువః - దుఃఖనాశకుడవు, స్వః - సుఖదాయకుడవు, ఓం - సర్వ రక్షకుడవు అగు నీ కొఱకు, స్వాహా - ఈ ఆహుతి నిచ్చుచున్నాను.

ఓం **యాం మేధాం దేవగణాః పితరశ్చోపాసతే, తయా**
**మామద్య మేధయాగ్నే మేధావినం కురు స్వాహా.**
అగ్నే! - జ్ఞానస్వరూప పరమేశ్వరా!, దేవగణాః - విద్వత్సముదాయములు, చ - మఱియు, పితరశ్చ - జ్ఞానులు, యాం మేధాం - ఏ మేధా బుద్ధిని, ఉపాసతే - ఉపాసించుచున్నారో, తయా మేధయా - ఆ మేధా బుద్ధితో, అద్య - ఇప్పుడు, మేధావినం కురు - నన్ను మేధావిని చేయుము, స్వాహా - ఈ భావనతో ఆహుతి నిచ్చుచున్నాను.
జ్ఞానస్వరూప పరమేశ్వరా! విద్వాంసులు, జ్ఞానులు, ఏ మేధాబుద్ధిని కోరుచున్నారో, ఆ మేధాబుద్ధిని నాకు కలిగింపుము.

ఓం **విశ్వాని దేవ సవితర్దురితాని పరాసువ.**
**యద్భద్రం తన్న ఆసువ స్వాహా. (యజు. 30.3)**

ఓం **అగ్నే నయ సుపథా రాయే అస్మాన్**
**విశ్వాని దేవ వయునాని విద్వాన్**
**యుయోధ్యస్మజ్జుహురాణ మేనో**
**భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ స్వాహా. (యజు. 40.16)**

(పై రెండు మంత్రముల కర్థములు స్తుతి ప్రార్థ నోపాసనా మంత్రములలో వ్రాయబడినవి.)

ఓం **సర్వం వై పూర్ణగ్ం స్వాహా. 1**
ఓం **సర్వం వై పూర్ణగ్ం స్వాహా. 2**
ఓం **సర్వం వై పూర్ణగ్ం స్వాహా. 3**

ఓం - హే రక్షక! సర్వం - సమస్త యజ్ఞకార్యక్రమము, వై - నిశ్చయముగా, పూర్ణం - పూర్తియైనది.

ఓం వసోః పవిత్రమసి శతధారం, వసోః పవిత్రమసి సహస్రధారం
దేవస్త్వా సవితా పునాతు, వసోః పవిత్రేణ శతధారేణ సుప్త్వా
కామధుక్షః స్వాహా, (యజు. 1-3)

## ప్రార్థన

ఓం తేజోzసి తేజో మయి ధేహి
ఓం వీర్యమసి వీర్యం మయి ధేహి
ఓం బలమసి బలం మయి ధేహి
ఓం ఓజోzసి ఓజో మయి ధేహి
ఓం మన్యురసి మన్యుం మయి ధేహి
ఓం సహోzసి సహో మయి ధేహి.

సర్వే భవంతు సుఖినః సర్వే సంతు నిరామయాః
సర్వే భద్రాణి పశ్యంతు, మా కశ్చిద్ దుఃఖభాగ్భవేత్.
కాలే వర్షతు పర్జన్యః, పృథివీ సస్యశాలినీ
లోకోzయం క్షోభరహితః, సజ్జనాః సంతు నిర్భయాః.
స్వస్తి ప్రజాభ్యః పరిపాలయన్తాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః
గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం
లోకాస్సమస్తాః సుఖినో భవన్తు.

## శాంతిపాఠ మంత్రము

ఓం ద్యౌః శాంతి, రంతరిక్షగ్ం శాంతిః, పృథివీ శాంతి,
రాపః శాంతిః, ఓషధయః శాంతిః; వనస్పతయః శాంతిః
విశ్వేదేవాః శాంతిః, బ్రహ్మశాంతిః; సర్వగ్ం శాంతిః
శాంతిరేవ శాంతిః, సా మా శాంతి రేధి. (య. 36-17.)

ఓం శాంతిః శాంతిః శాంతిః

## సత్యవ్రత మంత్రములు

ఓం అగ్నే! వ్రతపతే! వ్రతం చరిష్యామి,
తత్తే ప్రబ్రవీమి, తచ్ఛకేయం, తేన ఋధ్యాస,
మిదమహమనృతాత్ సత్యముపైమి స్వాహా
ఇదమగ్నయ ఇదం న మమ.

ఓం వాయో! వ్రతపతే! వ్రతం చరిష్యామి,
తత్తే ప్రబ్రవీమి, తచ్ఛకేయం, తేన ఋధ్యాస,
మిదమహమనృతాత్ సత్యముపైమి స్వాహా
ఇదం వాయవ ఇదం న మమ.

ఓం సూర్య! వ్రతపతే! వ్రతం చరిష్యామి,
తత్తే ప్రబ్రవీమి, తచ్ఛకేయం, తేన ఋధ్యాస,
మిదమహమనృతాత్ సత్యముపైమి స్వాహా
ఇదం సూర్యాయ ఇదం న మమ.

ఓం చంద్ర! వ్రతపతే! వ్రతం చరిష్యామి,
తత్తే ప్రబ్రవీమి, తచ్ఛకేయం, తేన ఋధ్యాస,
మిదమహమనృతాత్ సత్యముపైమి స్వాహా
ఇదం చంద్రాయ ఇదం న మమ.

ఓం వ్రతానాం ! వ్రతపతే! వ్రతం చరిష్యామి,
తత్తే ప్రబ్రవీమి, తచ్ఛకేయం, తేన ఋధ్యాస,
మిదమహమనృతాత్ సత్యముపైమి స్వాహా
ఇదమింద్రాయ వ్రతపతయ ఇదం న మమ.

ఓ పరమేశ్వర ! నీవు వ్రతపతివి. నేను వ్రతమాచరింతును. అది నీకు చెప్పి చేయుదును. దాని నాచరించు శక్తి నాకు కలుగుగాక! దాని వలన నేను వృద్ధి నొందుదునుగాక! నేను అసత్యమును వదలి సత్యమును గ్రహింతును. సత్యమే నమ్ముదును. సత్యమే యాచరింతును. ఇదియే నా వ్రతము" అని పై మంత్రముల కర్థము.

## పితృ యజ్ఞము

పితృయజ్ఞము తర్పణము, శ్రాద్ధము నని రెండు విధములు. విద్వాంసులను, ఋషులను, పితరులను సుఖపెట్టు కర్మము తర్పణ మనబడును. వారిని శ్రద్ధతో సేవించుట శ్రాద్ధమనబడును. ఈ రెండు విధములయిన కర్మలు విద్వాంసులు మున్నగువారు బ్రతికియున్నపుడే సంభవించును. చచ్చినవారిని సుఖింపజేయుటకాని, శ్రద్ధతో సేవించుటకాని సంభవింపదు. చచ్చినవారితో బ్రతికినవారికి సంబంధ ముండనేరదు. సంబంధము లేక సేవనాది క్రియలు జరుగుటకు వీలులేదు. చచ్చిన వారి నుద్దేశించి చేయు క్రియలు వారికి చెందనేరవు. అందువలన వ్యర్థములగును. కాబట్టి బ్రతికియున్న విద్వాంసులు మున్నగువారి నుద్దేశించి తర్పణ - సేవనాత్మక పితృయజ్ఞము ఉపదేశింపబడినది. ఇట్లు సత్కరింపదగినవారు దేవతలు, విద్వాంసులు, ఋషులు, పితరులు.

## రాష్ట్రీయ ప్రార్థన

**ఓం ఆ బ్రహ్మన్ బ్రాహ్మణో బ్రహ్మ వర్చసీ జాయతామ్। ఆ రాష్ట్రే రాజన్యః శూర ఇషవ్యోzతివ్యాధీ మహారథో జాయతామ్। దోగ్ధ్రీ ధేను ర్వోఢాzనడ్వానాశుః సప్తిః। పురంధిర్యోషా జిష్ణూ రథేష్ఠాః సభేయో యువాస్య యజమానస్య వీరో జాయతామ్। నికామే నికామే నః పర్జన్యో వర్షతు। ఫలవత్యో న ఓషధయః పచ్యన్తామ్। యోగక్షేమో నః కల్పతామ్ ।** య. 22-22

బ్రహ్మన్ స్వరాష్ట్రమే( హో(, ద్విజ బ్రహ్మ తేజ ధారీ,
క్షత్రియ మహారథీ హో(, అరిదల్ వినాశకారీ ॥
హోవే( దుధారు గౌఏ(, పశు అశ్వ ఆశువాహీ,
ఆధార రాష్ట్ర కీ హో(, నారీ శుభగ సదాహీ ॥
బలవాన్ సభ్యయోద్ధా, యజమాన పుత్ర హోవే(,
ఇచ్ఛానుసార వర్షే( పర్జన్య తాప ధోవే( ॥
ఫలపూల సే లదీ హో(, ఔషధ అమోఘ సారీ,
హో యోగ క్షేమకారీ, స్వాధీనతా హమారీ ॥ బ్రహ్మన్ ॥

## దేవతల విషయమున ప్రమాణము

ఓం పునంతు మా దేవజనాః పునన్తు మనసా ధియః
పునన్తు విశ్వా భూతాని జాతవేదః పునీహి మా. (యజు. 19-39)
ద్వయం వా ఇదం న తృతీయ మస్తి సత్యం చైవానృతం చ
సత్యమేవ దేవా అనృతం మనుష్యాః ఇదమహమనృతా
త్సత్యముపైమీతి, తన్మనుష్యేభ్యో దేవానుపైతి
స వై సత్యమేవ వదేత్ ఏతద్ధ వై దేవా వ్రతం చరన్తి,
యత్సత్యం తస్మాత్తే యశో యశోహ భవతి య ఏవం
విద్వాన్ సత్యం వదతి (శత. 1-1-1-4,5)
విద్వాంసో హి దేవాః (శత. 3-7-6-10)

మంత్రార్థము:- ఓ పరమేశ్వర! నన్ను అన్ని విధముల పవిత్రునొనరింపుము. నీయందు నిష్ఠగలిగి నీ యాజ్ఞలను పాలించు (దేవజనాః) విద్వాంసులు విద్యాదానముచే నన్ను పవిత్రము చేయుదురుగాక! అట్లే నీచే నీయబడిన విజ్ఞానము ద్వారా మా బుద్ధులు పవిత్రములగుగాక! నీ కృపచే సమస్త భూతములు పవిత్రములై సుఖముల ననుభవించుగాత!

(ద్వయం వా.....) రెండు లక్షణములచే మనుజులు దేవతలు, మనుష్యులు నని రెండు పేరులతో చెప్పబడుదురు. ఇట్లు పిలువబడుటకు సత్యము, అనృతమును కారణములు. సత్యము చెప్పుట, సత్యము నంగీకరించుట, సత్యము నాచరించుట దేవతలలక్షణము, అనృతము (అబద్ధము) చెప్పుట, అనృత మాచరించుట, అనృతము నంగీకరించుటయు మనుష్యుల లక్షణము. అనృతమును విడిచి సత్యమును పొందువాడు దేవతగా లెక్కింప బడును. సత్యమును విడిచి అనృతము నంగీకరించువాడు మనుష్యుడన బడును. కాబట్టి సదా సత్యము చెప్పవలయును. సత్యము నంగీకరింపవలయును. దేవతలు సత్యవ్రతమునే ఆచరింతురు - యశస్వులగుదురు. కాబట్టి విద్వాంసులే దేవతలని అభిప్రాయము.

## ఋషుల విషయమున ప్రమాణము

ఓం తం యజ్ఞం బర్హిషి ప్రౌక్షన్ పురుషం జాతమగ్రతః
తేన దేవా అయజన్త సాధ్యా ఋషయశ్చ యే. (య. 31-9)
అథ యదేవాను బ్రువీత తేనర్షిభ్య ఋణం జాయతే
తద్ధేభ్య ఏతత్కరోతి ఋషీణాం నిధిగోప ఇతి
హ్యనూచాన మాహుః (శత. 1-7-1-3)
అథార్షేయం ప్రవృణీతే, ఋషిభ్య శ్చైవైనమేత
ద్దేవేభ్యశ్చ నివేదయత్యయం మహావీర్యో యో యజ్ఞం
ప్రాపదితి తస్మాదార్షేయం ప్రవృణీతే. (శ. 1-4-2-3)

(అథయదేవ....) సర్వవిద్యలను సంపాదించిన తదుపరి అధ్యాపనము (అనువచనము) చేయుట ఋషులకృత్యము. అధ్యయన అధ్యాపన క్రియలచే ఋషుల కీయదగు ఋణమేర్పడును. ఋషులకు చేయుసేవ వారికి సుఖకారకమగును. సర్వవిద్యల నెఱింగినవాడై యధ్యాపనము చేయువాడు ఋషియనబడును. పాఠనకర్మము ఋషికర్మమనబడును. ఇట్టి ఋషులను సేవించి, వారికి ప్రియమాచరించిన విద్యార్థిని వారు విద్వాంసు నొనరింతురు. విద్వాంసుడును, విద్యను గ్రహించువాడును ఋషి సంజ్ఞను పొందుదురు. ఇట్టి ఆర్షకర్మ మెల్లరిచే నాచరింపవలయును.

## పితరుల విషయమున ప్రమాణము

ఊర్జం వహంతీరమృతం ఘృతం పయః కీలాలం
పరిస్రుతమ్, స్వధా స్థ తర్పయత మే పితౄన్. (య 2-34)

(ఊర్జం....) తండ్రి, తాత, ఆచార్యుడు మున్నగువారిని సేవ చేత ప్రసన్నులగునట్లు చేయవలయును. శుద్ధజలము, అమృతమువంటి రసములు, నేయి, పాలు, చక్కగా సంస్కరింపబడిన అన్నము, తేనె, చక్కగా పండిన పండ్లు మున్నగు పదార్థములచే వారిని సేవింపవలయును.

## పితరుల పరిగణన

**సోమసదః అగ్నిష్వాత్తాః బర్హిషదః సోమపాః**
**హవిర్భుజః ఆజ్యపాః సుకాలినః యమరాజాశ్చేతి.**

(సోమసదులు) ఈశ్వరునియందు నిష్ఠగలవారు, సోమయాగమున నిపుణులు, సౌమ్యగుణములు కలవారు, (అగ్నిష్వాత్తులు) ఈశ్వరుని బాగుగ గ్రహించినవారు, లేక అగ్ని గుణముల నెఱుగుటచే యానయంత్రములను రచింపవలయు పదార్థవిద్య బాగుగ నెఱిగినవారు, (బర్హిషదులు) బ్రహ్మయందో లేక శాంతి - ఆది ఉత్తమగుణములందో వర్తిల్లువారు, (సోమపులు) యజ్ఞమున నుత్తమ ఓషధీరసమును పానముచేయువారు. (హవిర్భుజః) యజ్ఞముచే శోధింపబడిన వర్షజలాదుల ననుభవించు స్వభావముకలవారు, (ఆజ్యపులు) ఘృతమునో, విజ్ఞానమునో యిచ్చి రక్షించు స్వభావము గల విద్వాంసులు, (సుకాలులు) ఈశ్వరజ్ఞాన ప్రాప్తితో సుఖముగా కాలము గడపువారు, (యమరాజులు) పక్షపాతమును విడిచి న్యాయ వ్యవస్థ నొనరించువారు.

**పితృ పితామహ ప్రపితామహాః మాతృపితామహీ**

**ప్రపితామహ్యః సగోత్రాః (ఆచార్యాది) సంబంధినః.**

విద్వాంసుల శ్రేష్ఠగుణములను ధరించుచు విజ్ఞానవంతులై స్వజనులను ధరించి పోషించుటయేగాక యిరువదినాలుగు సంవత్సరములు బ్రహ్మచర్య పూర్వకముగా విద్య నభ్యసించువారును, స్వజనకులును పితరులు - వసువులు- అనబడుదురు. ఈశ్వరుడును వసు వనబడును. పక్షపాతరహితులై దుష్టుల నేడ్పించుచు నలుబదినాలుగేండ్లు విద్య నభ్యసించు బ్రహ్మచారులు-రుద్రులు, స్వపితామహులు, ఈశ్వరుడు పితామహ శబ్దముచే గ్రహింపబడుదురు. ప్రపితామహశబ్దముచే ఆదిత్యునివలె నుత్తమగుణ ప్రకాశకులై నలుబది యెనిమిదేండ్లు బ్రహ్మచర్యముతో విద్యాసంపన్నులు, సూర్య విద్యాప్రకాశకులు, స్వప్రపితామహులు, ఈశ్వరుడు గ్రహింపదగుదురు. వీరితో బాటు మాత, పితామహి, ప్రపితామహి; పుత్రాదులు, గురుమిత్రాదులు నెల్లరు సదా సేవింపదగినవారు.

ఇట్లు జీవించియున్న విద్వాంసులకు, ఋషులకు, పితృపితామహాదులకు సుఖము కలిగించు నిమిత్తము ప్రీతితో చేయు సేవ తర్పణమనియు శ్రద్ధతో చేయు సేవ శ్రాద్ధమనియు చెప్పబడును.

సత్యవిజ్ఞానముద్వారా జనులను రక్షించువారు పితరులనబడుదురు. ఇందుకు "యే నః పూర్వే పితరః సోమ్యాసః" ప్రభృతి యజుర్వేదము యొక్క పందొమ్మిదవ యధ్యాయములోని మంత్రములు ప్రమాణములుగా నెంచవలయును. యమరాజులు అను పేరుగల పితరుల విషయమున "యే సమానాః సమనసః పితరో యమరాజ్యే" ప్రభృతిమంత్రములు ప్రమాణములు. పితృపితామహాదుల విషయమున "ఏవం నమో వః పితరో రసాయ" అను ఋగ్యజుర్వేద మంత్ర వచనములు ప్రమాణములు మఱియు

**వసూన్ వదన్తి వై పిత్యాన్ రుద్రాంశ్చైవ పితామహాన్**
**ప్రపితామహాం శ్చాదిత్యాన్ శ్రుతిరేషా సనాతనీ.** మ. 3-284

అను నిట్టి మన్వాది శ్లోకములును ప్రమాణములు.

## బలివైశ్వదేవ యజ్ఞము

ఉప్పు వేయని పక్వమైన అన్నముతోనే బలివైశ్వదేవము చేయవలయును.

**వైశ్వదేవస్య సిద్ధస్య గృహ్యేతేఽగ్నౌ విధిపూర్వకమ్**
**ఆభ్యః కుర్యాద్దేవతాభ్యో బ్రాహ్మణో హోమమన్వహమ్.** మ. 3-84

అన్నము పక్వమై సిద్ధమైనపుడు అందు నేయి, పంచదార కలిపి దానితో ప్రొయ్యిలో నుండి కొంచెము నిప్పు బయట వేఱుగా తీసియుంచి దానియం దీ క్రింది మంత్రములతో నాహుతు లీయవలయును

## హోమ మంత్రములు

1 " ఓం అగ్నయే స్వాహా ॥ "
2 " ఓం సోమాయ స్వాహా ॥ "
3 " ఓం అగ్నీషోమాభ్యాం స్వాహా ॥ "
4 " ఓం విశ్వేభ్యో దేవేభ్యః స్వాహా ॥ "
5 " ఓం ధన్వంతరయే స్వాహా ॥ "
6 " ఓం కుహ్వై స్వాహా ॥ "
7 " ఓం అనుమత్యై స్వాహా ॥ "
8 " ఓం ప్రజాపతయే స్వాహా ॥ "
9 " ఓం సహద్యావాపృథివీభ్యాం స్వాహా ॥ "
10 " ఓం స్విష్టకృతే స్వాహా ॥ "

ఈ మంత్రములోని అగ్ని, సోమ, ధన్వంతరి మున్నగు పదములచే పరమేశ్వరునే గ్రహింపవలయును.

ఇట్లు మంత్రములతో నాహుతుల నిచ్చిన పిదప క్రింది మంత్ర వాక్యములతో బలి ప్రదానము చేయవలయును.

1 " ఓం సానుగాయేంద్రాయ నమః ॥ "
2 " ఓం సానుగాయ యమాయ నమః ॥ "
3 " ఓం సానుగాయ వరుణాయ నమః ॥ "
4 " ఓం సానుగాయ సోమాయ నమః ॥ "
5 " ఓం మరుద్భ్యో నమః ॥ "
6 " ఓం అద్భ్యో నమః ॥ "
7 " ఓం వనస్పతిభ్యో నమః ॥ "
8 " ఓం శ్రియై నమః ॥ "
9 " ఓం భద్రకాల్యై నమః ॥ "
10 " ఓం బ్రహ్మపతయే నమః ॥ "

11 " ఓం వాస్తుపతయే నమః ॥ "
12 " ఓం విశ్వేభ్యో దేవేభ్యో నమః ॥ "
13 " ఓం దివాచరేభ్యో భూతేభ్యో నమః ॥ "
14 " ఓం నక్తంచారిభ్యో భూతేభ్యో నమః ॥ "
15 " ఓం సర్వాత్మభూతయే నమః ॥ "
16 " ఓం పితృభ్యః స్వధాయిభ్యః స్వధా నమః ॥ "

ఈ మంత్రములలోని నామములును ఈశ్వరునే బోధించును.

" శునాం చ పతితానాం చ శ్వపచాం పాపరోగిణామ్
వాయసానాం కృమీణాం చ శనకై ర్నిర్వపేద్భువి" (మ. 3-92)

అను నీ మను శ్లోకము ననుసరించి, కుక్కలకు, నిరుపేదలకు, కుష్ఠు మున్నగు పాపరోగులకు, కాకులకు, చీమలు మున్నగు కీటకములకు అన్నభాగములను ఇచ్చి వాని జీవితమునకు తోడ్పడవలయును.

## బలివైశ్వదేవకర్మ విషయమున ప్రమాణము

"ఓం అహరహర్బలిమిత్తే హరన్తోzశ్వాయేవ తిష్ఠతే
ఘాసమగ్నే రాయస్పోషేణ సముషామదన్తో
మాతే అగ్నే ప్రతి వశోరిషామ." (అథ. 19-7-7)

"పునన్తు మా దేవజనాః పునన్తు మనసా ధియః
పునన్తు విశ్వా భూతాని జాతవేదః పునీహి మా. "

(పునంతు) అను నీ మంత్రార్థము పూర్వమే వ్రాయబడినది.

(అహరహర్బలి:....) ఓ పరమేశ్వరా! నీ యాజ్ఞవలన నెవరు నిత్యము బలి వైశ్వదేవము చేయుదురో వారు సంపత్సమృద్ధితోను, శుభేచ్ఛతోను, నిత్యానందమును బొందుదురు. అశ్వసమ్ముఖమున గడ్డి, జలము మున్నగు ఖాద్యపదార్థముల నుంచునట్లు ఉత్తమపదార్థముల నెల్ల ప్రాణులకు కల్పించుచు ప్రసన్నులగుదురు. ఓ పరమదేవ! నీ యాజ్ఞలకు విరుద్ధములగు వ్యవహారములం దెన్నడు ప్రవేశింపము. అన్యాయముగ ప్రాణుల నెన్నడు పీడింపము. ఎల్లరను మిత్రులవలె చూతుము.

## అతిథి యజ్ఞము

అతిథులను యథాయోగ్యముగ సేవించువారికి శుభములు కలుగును. పూర్ణ విద్యావంతులు, పరోపకారులు, జితేంద్రియులు, ధార్మికులు, సత్యవాదులు, కపటము మున్నగు దోషములు లేనివారు, నిత్యము పర్యటనము చేయు మనుజులు అతిథు లనబడుదురు. ఈ విషయమున ప్రమాణము లనదగు మంత్రములు వేదములం దనేకము లున్నను సంక్షేపముగా రెండు మంత్రములనే వ్రాయుచున్నాము.

**" తద్యస్యైవం విద్వాన్ వ్రాత్యోzతిథిర్గృహానాగచ్ఛేత్"** 1.

**" స్వయమేనమభ్యుదేత్య బ్రూయాద్, వ్రాత్య క్వాzవా**
**త్సీర్, వ్రాత్యోదకం, వ్రాత్య తర్పయంతు, వ్రాత్య యథా**
**తే ప్రియం తథాzస్తు, వ్రాత్య యథా తే వశ**
**స్తథాzస్తు! వ్రాత్య యథా తే నికామస్తథాస్త్వితి"** (అథ. కాం. 15 సూ. 11 మం. 2)

(తద్య......) ఉత్తమ గుణములతో కూడి రాకపోకల సమయము నియతముకాని విద్వాంసుడైన వ్యక్తి గృహమున, కరుదెంచినపుడు (స్వయమేన.....) స్వయముగా గృహస్థుడు ప్రేమతో నతని కెదురేగి నమస్కరించి తీసికొనివచ్చి ఉత్తమాసనమున కూర్చుండబెట్టవలయును, పిదప పానీయాదులు కావలయునా యని అడుగవలయును. అవసరమైన కోరికలను తీర్చి స్వస్థచిత్తుడైన తదుపరి 'ఆర్య! మీ రింతకుపూర్వ మెటనుంటిరి?' అని అడుగవలయును. ఈ యుదకమును గ్రహింపు డనవలయును. సత్యోపదేశము ద్వారమున మమ్ములను తృప్తి పఱతురు గాక! ఓ మహానుభావ! మీరు ప్రసన్నులగునట్లు మేము సేవింతుము. మీ కేది ప్రియమో ఆజ్ఞాపింతురు గాక! ఓ యతిథీ! మమ్ములను మీ కనుకూలురుగా భావించి మీ యిష్టము వచ్చిన సేవయందు మమ్ములను నియోగింపుడు. మీ యిష్టమును పూర్తి చేయుటకు సేవింతుము. ఇట్లాచరించుటచే మన ముభయులము సేవాసత్సంగాదుల ద్వారమున విద్యావృద్ధి నొనరించుకొని యెల్లప్పుడు సుఖము ననుభవింతుము.

## భోజనసమయమున పఠించు మంత్రము

ఓం అన్నపతే! అన్నస్యనో దే
హ్యనమీవస్య శుష్మిణః
ప్రప్రదాతారం తారిష
ఊర్జం నో ధేహి ద్విపదే చతుష్పదే. (య11-83)

అర్థము: - అన్నపతే! - పరమేశ్వర! నః - మాకు, అనమీవస్య - రోగరహితమైన, శుష్మిణః - బలదాయకమైన, అన్నస్య - అన్నమును,దేహి - ఇమ్ము, దాతారం - దాతను, ప్రప్రతారిషః - వర్థిల్లజేయుము, నః - మాయొక్క, ద్విపదే - ద్విపాత్తులకు, చతుష్పదే - చతుష్పాత్తులకు, ఊర్జం - బలకరమగు నాహారము, ధేహి - ఇమ్ము.

## శయనకాలమున స్మరింపదగు శివసంకల్ప మంత్రములు

ఓం యజ్జాగ్రతో దూరముదైతి దైవం
తదు సుప్తస్య తథైవైతి
దూరంగమం జ్యోతిషాం జ్యోతిరేకం
తన్మే మనః శివసంకల్పమస్తు. (యజు. 34.1)

ఓం యేన కర్మాణ్యపసో మనీషిణో
యజ్ఞే కృణ్వంతి విదథేషు ధీరాః
యదపూర్వం యక్షమంతః ప్రజానాం
తన్మే మనః శివసంకల్పమస్తు. (యజు. 34 2)

ఓం యత్ప్రజ్ఞానముత చేతో ధృతిశ్చ
యజ్జ్యోతిరంతరమృతం ప్రజాసు
యస్మాన్నఋతే కిం చన కర్మ క్రియతే
తన్మే మనః శివసంకల్పమస్తు. (యజు. 34.3)

ఓం యేనేదం భూతం భువనం భవిష్యత్
పరిగృహీతమమృతేన సర్వమ్
యేన యజ్ఞస్తాయతే సప్తహోతా
తన్మే మనః శివసంకల్పమస్తు. (య. 34. 4)

ఓం యస్మిన్ ఋచః సామ యజూగ్ంషి
యస్మిన్ ప్రతిష్ఠితా రథనాభావివారాః
యస్మింశ్చిత్తగ్ం సర్వమోతం ప్రజానాం
తన్మే మనః శివసంకల్పమస్తు. (య. 34. 5)

ఓం సుషారథిరశ్వానివ యన్మనుష్యాన్
నేనీయతేఽభీషుభిర్వాజినఽఇవ
హృత్ప్రతిష్ఠం యదజిరం జవిష్ఠం
తన్మే మనః శివసంకల్పమస్తు. (య. 34. 6)

ఈ మంత్రములకు అర్థము శాంతి ప్రకరణములో వ్రాయబడినది.

## సంకల్పము

ఓం తత్సత్ అద్య బ్రహ్మణః ద్వితీయ ప్రహరార్ధే శ్వేతవరాహకల్పే సప్తమే వైవస్వత మన్వంతరే అష్టావింశతి తమే కలియుగే ప్రథమ పాదే..... సంవత్సరే..... అయనే.....ఋతౌ......... మాసే......పక్షే....... తిథౌ.... వాసరే శుభనక్షత్ర శుభలగ్న శుభముహూర్తే అత్ర అహం కర్మ కరణాయ భవంతం వృణే.

## భజన 1

### సురట రాగము

సర్వ హితరతా - స్వామీ - సర్వ బుధనుతా
సర్వమందు నీవు గలవు - సర్వము నీయందుఁ గలదు
సర్వము నర్పించి నీకే - సర్వమునులు సంతసింత్రు. ॥ స ॥
సర్వలోక నాయకుఁడవు - సర్వసౌఖ్య దాయకుఁడవు
సర్వభక్తులు నిన్నుఁగొల్చి - సర్వ సుఖము లనుభవింత్రు. ॥ స ॥
సర్వపాప నాశకుఁడవు - సర్వసదుపదేశకుఁడవు
సర్వులు నీ శరణుఁజొచ్చి - సర్వపాప విముక్తి ఁ గాంత్రు.
సర్వదీన బంధువని - సర్వజ్ఞాన సింధువని
సర్వము గని విందువని - సర్వజనులు సంశ్రయింత్రు. ॥ స ॥

### హిందూస్తాని భైరవి - రూపకము

విశ్వవిభుని ధ్యానము - విమలముక్తి సోపానము
శాశ్వతసుఖ సంధానము - సకలఋషి విధానము, ॥ విశ్వ ॥
కామక్రోధ లోభముల్ - కఠిన శత్రు జాలముల్
నేమముతో వానినడప - నిజము చెదరు దురితముల్. ॥ విశ్వ ॥
చిత్తమం దసూయ పుట్టి - చిచ్చువోలె మండకుండ
ఉత్తమ శాంతస్వభావ - మూని యుండుము నిరతము, ॥ విశ్వ ॥
మిత్రదృష్టితోడఁ బ్రాణి - మాత్ర మెపుడు చూడుము
పాత్రవ ర్తనగల్గి జీవన - యాత్రసలుపఁగడఁగుము. ॥ విశ్వ ॥
జగము నద్భుతంబుగా - సలిపి యేలు వానికంటె
జగతి నధికుఁడెవఁడు లేడు - శరణ మతనిఁబొందుము. ॥ విశ్వ ॥

### తోడి రాగము

నిన్నె తలఁతుము - నిన్నె వలతుము నిన్నె కొలిచెదము
నిన్నె ప్రభువర, చిత్తపద్మమున - నిల్పి సుఖించెదము. ॥ ని ॥
ఏ కష్టము మా కొదవిన నిన్నే - యెంచి సహించెదము
లోకేశా నీనామ మంత్ర మెద - లోన జపించెదము. ॥ ని ॥

నిన్నె ప్రాపుగాఁ గొని పాపాబ్ధిని నిజముగ దాఁటెదము
నిన్నె పతితోద్ధారకుఁడనుచును - నిరతము చాటెదము. ॥ ని ॥
చిత్ర విచిత్రపు సృష్టిని మాకై - చేసిన నీ కృపను
చిత్ర విచిత్రపు రీతిని సతతము - చెలఁగుచుఁ బాడెదము. ॥ ని ॥

**హిందూస్తాని భైరవి - చాపు**

నేడు మనమందఱము కూడి పాడుదము పరమేశుని
ఈడు జగమున లేక యంతట - హెచ్చివెలిఁగెడు జ్యోతిని. ॥ నేడు ॥
కందరమ్ముల మందిరమ్ముల - గహన పర్వత సీమల
సుందర ధ్వనితోడ యోగులు - స్తుతి యొనర్చెడు దేవుని. ॥ నేడు ॥
చెట్టు చెట్టునఁ గాననంబున - జెలఁగు మధురరుతంబులఁ
బిట్ట లెవనిని బాడుచుండునొ - ప్రీతిసాగరు నాతని. ॥ నేడు ॥
నూతులందును చెఱువులందును - లోఁతు తెలియని జలధిలో
శీతజలమును ద్రావి కీర్తన - చేయు జలచర మాతని ॥ నేడు ॥
ఉత్సవంబుల నుల్లమలరఁగ - నువిద లెవ్వనిఁబాడుచు
నుత్సహింతురొ యాదయామయు - నుత్తమోత్తమపురుషుని. ॥ నేడు ॥
శూరులును వీరాధివీరులు - శుద్ధహృదయాంబుజముల
సారె సారెకు నెవనిఁదలఁతురొ - సత్స్వరూపుఁబరేశుని. ॥ నేడు ॥

**ముఖారి - ఆదితాళము**

నిఖిల జగములేలుఱేడు నిన్ను నేల కుండునా?
నిఖిల మెఱుఁగు సర్వసాక్షి నిన్ను నెఱుఁగకుండునా? ॥ నిఖి ॥
నిఖిల జీవరక్షకుండు నిన్ను గావకుండునా?
నిఖిల భువన నాయకుండు నిన్ను నడపకుండునా? ॥ నిఖి ॥
నిఖిల మతని కప్పగింప నిన్ను మెచ్చకుండునా?
నిఖిల మతనిదనియె యనిన నీకు దుఃఖముండునా? ॥ నిఖి ॥
నిండి యంత టుండువాడు నీలో నుండకుండునా?
నిండు మదిని నతనిగొల్వ నీకు లోప ముండునా? ॥ నిఖి ॥

## మధ్యమావతి - ఆదితాళము

మరి రాదుర యీ - మానుషజన్మము
పరమ పురుష కృప - వలననె కలిగెను. ॥ మ ॥
పరమేశుని వౌ - పరమాద్భుతముల
దరిసెన మొనరుపఁ - దగు యంత్రంబిది. ॥ మ ॥
పరి పరి విధములఁ - బరులకు హితములఁ
దఱినిఁ జేయు సా - ధనరాజమ్మిది. ॥ మ ॥
ఘన సద్గుణమణి - గణము గడింపఁగ
మనకు లభించిన - మహిత ధన మ్మిది. ॥ మ ॥
దేవుని జేర్పఁగ - జీవుని గొని చను
దేవదత్తమౌ - దివ్యరథం బిది. ॥ మ ॥
కాని దీనిఁజెడు - కార్యము లందిడు
వాని జన్మ మిల - వ్యర్థము వ్యర్థము. ॥ మ ॥

## కమాచ్ - చాపుతాళము

కొనియాడఁదరమే నిన్నుఁ - గువలయ వినుత !
కొనియాడఁదరమే నిన్ను
దినకర శశి తార - గణముల వెలిగించు
ఘనతేజమును జూపు - కాంతిమంతుడ వీవు ॥ కొని ॥
బొంగరమ్ముల మాడ్కి - భూమ్యాది గ్రహముల
నింగి గిరగిరఁ ద్రిప్పు - నేర్పుకాడవు నీవు ॥ కొని ॥
ఒండొంటి ఢీ కొన - కుండ లోకముల ను
ద్దండ రీతిని నడపు - చండశాసనుఁ డీవు ॥ కొని ॥
స్తుత్యమౌ నీ సృష్టి - సుందరమ్ముగఁజేసి
యత్యద్భుతముఁజూపు - నైంద్రజాలుఁడ వీవు ॥ కొని ॥
పాఠశాలగ జగతి - బహువిధములఁజేసి
పాఠములను నేర్పు - పరమగురుఁడవు నీవు. ॥ కొని ॥

## కల్యాణి - ఆదితాళము

దినమది సుదినము కాదా (ప్రభు) దినమది సుదినము కాదా!
కనుఁగొని నిను మది - గానము చేసెడు ॥ ది ॥
ఘనులగు నీ భక్త - జనములఁగూడి ॥ ది ॥
మునినుత నినుఁగూర్చి - ముచ్చట లాడెడు
కనికర మెదలోఁ - గరఁగి పాఱఁగా
ననదల కష్టము - లన్నియు దీర్చెడు ॥ ది ॥
ధీరత నీ యాజ్ఞఁ - దీరిచి పాల్చెడు
వీరుల చరితము - విని హర్షించెడు ॥ ది ॥
కళలఁదేరి స - త్కార్యము లొనరిచి
విలసిలు బుధులను - వేడ్కమన్నించెడు ॥ ది ॥
నీదయఁగల్గిన - నిఖిల బంధువుల
నాదరించి ముద - మందుచు నుండెడు. ॥ ది ॥

## డోల ప్రార్థన

వహ్ శక్తి హమేఁదో దయానిధే! కర్తవ్యమార్గపర్ డట్‌జావేఁ।
పరసేవా పరఉపకారమేఁ హమ్, పీఛేకో కభీ న హట్ జావే ఁ ॥
హమ్ దీన దుఖీ, నిబలోఁ వికలోఁకే సేవక్‌బన్ సంతాప్ హరేఁ।
జోహైఁ అటకే భూలే భటకే ఉన్‌కో తారేఁ హమ్‌తర్ జావేఁ ॥
ఛల్, దమ్భ, ద్వేష్, పాఖండ్, ఝూఠ్, అన్యాయ్‌సే నిశిదిన్ దూర్ రహేఁ।
జీవన్ హో శుద్ధ్ సరల్ అప్‌నా, శుచి ప్రేమ్ సుధారస్ బర్ సావేఁ ॥
నిజ - ఆన్ - మూన్ మర్యాదాకా, ప్రభు! ధ్యానరహేఁ, అభిమాన రహేఁ।
జిస్ దేశజాతిమేఁ జన్మలియా, ఉస్‌పర్ సర్వ్ దే కట్ జావేఁ ॥

## జంఝూటి - ఆది

వదలి కుమార్గము వరమార్గంబున - వర్తిలు చుండవె యో మనసా।
సదమల భక్తిని స్వామిని గొలుచుచు - సౌఖ్యము లందవె యో మనసా ॥
పరుల సుఖమునే పాటించుచు భువి - పనులొనరింపవె యో మనసా।
దురితదవాగ్నిని దూకుచు దారుణ - దుఃఖము లందకె యో మనసా ॥ ॥వ॥

సత్యమె సర్వశ్రేయస్కరమని - సతత మెఱుంగవె యో మనసా ।
సత్యవ్రతమును సలిపెడు నప్పుడె - శౌర్యము జూపవె యో మనసా ॥ ॥వ॥
న్యాయమె స్వర్గప్రాయము జగతిని నమ్ముము దృఢముగ నో మనసా ॥
న్యాయము దప్పిన నరకంబుగ భువి - నాడే మాఱునె యో మనసా ॥ ॥వ॥
సుగుణ రత్నముల సొంపుగ దాలిచి - శోభిలుచుండవె యో మనసా ।
అగణిత గుణరత్నాకరుడగు పర - మాత్మయె శరణము విను మనసా ॥ ॥వ॥

## భగవత్ ప్రార్థన

ఆనందరూప భగవన్ । కిస్ భాంతి తుమ్ కో పా ఊఁ ।
తేరే సమీప్ స్వామిన్। మై ఁ కిస్ తరహ్ సే ఆ ఊఁ ॥ 1
అనుపమ్ పరమ్ ఛబీలె - బినరంగ్ రస్ రసీలె,
కంటక్ సఖా హై ఫుల్వా, క్యా తేరే సర్ చఢాఊఁ ॥ 2
సుఖ్ మూలముక్త్ రూపమ్, మంగల్ కుశల్ స్వరూపమ్,
ఘడియాల్ శంఖ్ కో క్యా, సన్ముఖ్ తేరే బజాఊఁ ॥ 3
గంగా హై తేరీ దాసీ, సేవక్ హై ఇంద్ర్ తేరా,
తేరే శరీర్ పై క్యా దో చుల్లూ జల్ చఢాఊఁ ॥ 4
ఛోటేసే దాస్ తేరే, రవి - చంద్ర హై ఉపస్థిత్,
కరతేహైఁ నిత్ ఉజాలా, ఘృత్ - దీప క్యా జలా ఊఁ ॥ 5
శ్రీ లక్ష్మి హై తేరీ, నిశిదిన్ చరణ్ కీ చేరీ,
తాంబేకా ఏక్ పైసా, మై నాథ్ క్యా దిలా ఊఁ ॥ 6
ఆగమ్ నిగమ్ సే లేకర్, మేధా సరస్వతీ తక్,
గుణ్ తేర గారహేహైఁ క్యా గాకె మైఁరిఝూఊఁ ॥ 7
కోటానుకోటి భూమి, ఉన్‌పర్ అసంఖ్య ప్రాణి,
జగదీశ్! అప్నా నంబర్ మైఁ కౌన్ సా గినా ఊఁ ॥ 8
వినతీ "కిశోర" కీ హై, నిశిదిన్ యహీ దయామయ్,
హృదయ్ మేఁ లౌ హో తేరీ ఆంఖో ఁ మే మైఁ సమా ఊఁ ॥ 9

**అఠాణా - చాపు**

బుద్ధిపై పొరతీయరా - భువనేశ్వరా। బుద్ధిపై పొరతీయరా,
శుద్ధమగు నీ సత్స్వరూపము - చూచిచూచి కృతార్థు లగుదుము।
శ్రద్ధతో నీ సేవ లొనరిచి - శాశ్వతానందమ్ము గాంతుము॥ ॥ బు ॥
భక్తి భిక్షము బెట్టరా - ప్రాణేశ్వర! భక్తి భిక్షము బెట్టరా,
శక్తి మీరగ బాపచయముల - జక్కగా జెండాడి వైతుము।
రక్తితో మా హృత్పురంబును - రాజధానిగ నీకు నిత్తుము॥ ॥ భక్తి ॥
దయను మాపై గురియరా - దయాకర ! దయను మాపై గురియరా,
దయను మాపై నీవు గురిసిన - దాపములు చల్లారిపోవును।
రయముగా హృత్క్షేత్రముల స-ద్రమ్యగుణముల పంట పండును॥ ॥ ద ॥
ఐకమత్యము గూర్పరా - అఖిలాధార! ఐకమత్యము గూర్పరా,
లోకమంతయు నీ కుటుంబము - లోనిదే యని తెలిసి మెలగుచు।
నీ కటాక్షముచేత వర్ధిలి - నిఖిలసుఖముల బడయుచుందుము॥ ॥ఐక ॥

**బేహగ్ - ఆదితాళము**

నీ నామమె యెంతో రుచిరా - నిఖిల సజ్జనగోచరా।
మానసమున కింపునింపు - మహిత వీణారవమురా॥ ॥ నీ ॥
మధురమైన నీ నామమె - మౌనులకును జపమురా।
అధమాధముల నుద్ధరింప - నంచిత సాధనమురా॥ ॥ నీ ॥
అఖిల పాపములను బాప - నదియె సిద్ధౌషధమురా।
సుఖము నాత్మబలము నిచ్చు - సురుచిరామృత రసమురా॥ ॥ నీ ॥
భవ్యధర్మరంగస్థిత - భక్త వీరకోటికి।
నవ్యయోత్సాహమ్ము గొల్పు - దివ్యభేరీ రవమురా॥ ॥ నీ ॥

**శంకరాభరణం - రూపక**

దేవ। నీ ప్రభావగరిమ - దెలియశక్యమా।
కేవలకరుణా ప్రపూరమ - కీర్తి ధామమా॥ ॥ దేవ ॥
పరమభక్తి నిన్ను గొలుచు - భక్త వరులకు।
దురితములను దరుముశక్తి - నిరత మిత్తువు॥ ॥ దేవ ॥

పరుల హితము కొఱకుఁబాటు- పడెడువారికి ।
నిరుపమానంద పదవి - నెమ్మి గూర్తువు ॥ ॥ దేవ ॥
నిన్నుజూడ నిచ్ఛగించు - నీతి పరులకు ।
నన్నిచోట్ల దర్శనమిడి । యాదరింతువు ॥ ॥ దేవ ॥
వివిధజగములను జెలంగు - వింత జూపగ ।
వివిధ దేహముల నొసంగు - విశ్వ విభుడవు ॥ ॥ దేవ ॥
మొదటఁగట్టిపెట్టి మదిని - పదను పఱచుచు ।
సదయహృదయుడౌట తుదకు - ముదము నింతువు ॥ ॥ దేవ ॥

**బేహగ్ - ఆదితాళము**

పరమ పితా మా - ప్రార్థన వినురా
పాపములోఁబడ - నీయకురా
శరణాగత ర - క్షకుఁడని నిన్నే
శరణు జొచ్చితిమి - విడువకురా । ॥పరమ॥
పరులను మావలె - భావించెడు మదిఁ
బరమాత్మా మా - కొసఁగుమురా
నిరతము నంతట - నీ మహిమలఁగను
నిరుపమ విద్యను - నేర్పుమురా ॥పరమ॥
నీ యాజ్ఞలనే - నెఱవేర్పగ మది
నిర్మల భక్తిని - నిలుపుమురా
న్యాయసత్యకరు - ణాలయ మాలో
నద్భుత నాట్యం - బాడుమురా! ॥పరమ॥
శాంతధామ మా - స్వాంతమునందలి
చింతల నీవెగఁ - జిమ్ముమురా
అంతరంగ మను - నరవిందము నీ
కెంతయుఁబ్రీతి న - ర్పింతుమురా! ॥పరమ॥

**నారాయణి - చాపు**

కరుణామృతపూరమా - పరంధామ - కరుణామృతపూరమా,
శరణుజొచ్చినవారిపాలికి - నరయ సుందర పారిజాతమ ।
పరమసుగుణ సముద్రమా ముని - వరులకును నినుబొగడతరమా ॥కరు॥
సర్వేశ్వరా శ్రీకరా - సర్వాధార - సర్వేశ్వరా శ్రీకరా,
సర్వదుర్గుణములకు లోబడి - గర్వమున గనుగానకుండెడు ।
దుర్వినీతులబట్టి దిద్దెడి - సర్వశక్తుడ వీవె దేవర ॥ ॥ సర్వే ॥
న్యాయపాలన భూషణ - అన్యాయశోషణ - న్యాయపాలన భూషణ,
న్యాయమున వర్తించువారల - కీ యమేయ సుఖంబు లొసగుచు ।
న్యాయమును బ్రకటించు సుజన - ధ్యేయ నిరుపమ పరమపావన ॥న్యాయ॥
సత్యవ్రతధారక - శాంతి ప్రసారక - సత్యవ్రత ధారక,
నిత్యసుఖ ధర్మప్రచారక - నిరుపమానందైకకారక
సత్యదీక్షాచరణపూరక - సాధుతాపత్రయ నివారక ॥ ॥సత్య॥

**మాయామాళవగౌళ - ఆదితాళము**

ఏమని పిలుతును నిన్ను నే - నేమని పిలుతును నిన్ను
స్వామీ యందున - సఖుఁడా యందున
ప్రేమకు నెలవగు - ప్రియుఁడా యందున ॥ఏమని॥
తల్లీయందున - తండ్రీ యందున
యెల్లరఁబ్రోచెడు - నీశ్వర యందున ॥ఏమని॥
దివ్యసౌఖ్య మిడు - దేవా యందున
అవ్యయుఁడగు పర - మాత్మా యందున ॥ఏమని॥
భవరోగమహా - వైద్యా యందున
వివిధ జగద్గణ - వేద్యా యందున ॥ఏమని॥
గురులకు నెల్లను - గురువా యందున
వరముల నిడుకల్ప - తరువా యందున ॥ఏమని॥
ఎంతయు భక్తుల - హృదయరంగముల
వింతగ వెలిఁగెడు - వెలుఁగా యందున ॥ఏమని॥

**కాఫి - చాపు**

వారె కృతార్థులు - వసుమతిలో స్వామి
కూరిమితో నిన్ను ( - గొల్చుచునుండెడు ॥వారె॥
దూరిన దారుణ - దుఃఖము లొదవిన
ధీరత నీ యాజ్ఞ( దీరిచి పాల్చెడు ॥వారె॥
విబుధుల( జేరి - విద్దెల(దేరి
శుభగుణవంతులై - శోభిలుచుండెడు ॥వారె॥
ప్రబలబలాఢ్యులై - భక్తి వినమ్రులై
యబలులకెల్లను - నభయ మొసంగెడు ॥వారె॥
అంతట నీవని - అన్నిట నీవని
అంతయు నీకయి - యర్పణచేసెడు ॥వారె॥

## యజ్ఞాంత ప్రార్థన

పూజనీయ ప్రభో హమారే భావ ఉజ్జ్వల కీజియే ।
ఛోడదేవేఁ ఛల కపట్‌కో మానసిక బల దీజియే ॥ 1
వేదకీ బోలేఁ ఋచాయే ఁ సత్యకో ధారణ్ కరేఁ ।
హర్షమే ఁ హోఁ మగ్నసారే శోకసాగరసే తరేఁ ॥ 2
అశ్వమేధాదిక్ రచాయేఁ యజ్ఞ పర ఉపకార కో ।
ధర్మమర్యాదా చలాకర్ లాభ్ దే ఁ సంసార కో ॥ 3
నిత్య శ్రద్ధాభక్తి సే యజ్ఞాది హమ్ కరతే రహే ఁ ।
రోగ పీడిత విశ్వ కే సంతాప్ సబ్ హరతే రహే ఁ ॥ 4
కామనా మిట్ జాయ్ మన్‌సే పాప అత్యాచార కీ ।
భావనాయేఁ పూర్ణ హోవేఁ యజ్ఞ సే నరనార కీ ॥ 5
లాభకారి హో హవన్ హర్ జీవధారీ కేలియే ।
వాయుజల సర్వత్ర హో శుభగంధ కో ధారణ్ కియే ॥ 6
స్వార్థ భావ్ మిటే హమరా ప్రేమపథ విస్తార హో ।
'ఇద న్న మమ కా ' సార్థక ప్రత్యేక మేఁ వ్యవహార హో ॥ 7
హాథ్ జోడ్ ఝుకాయె మస్తక్ వందనా హమ్ కర్ రహే ఁ ।
నాథ్ కరుణా రూపకరుణా ఆప్‌కీ సబ్ పర్ రహేఁ ॥ 8

## హారతి

ఓమ్ జయ జగదీశ హరే, ప్రభు! జయ జగదీశ హరే
భక్తజనోం కే సంకట క్షణమేఁదూర్‌కరే
జో ధ్యావే, ఫలపావే, దుఖ వినశే మనకా
సుఖ సంపత్ ఘర్ ఆవే, కష్టమిటే తనకా. ॥ ఓం ॥
మాతపితా తుమ్ మేరే, శరణ గహూఁ కిస్‌కీ
తుహ్ బినా ఔర్ న కో ఈ, ఆస్ కరూఁ జిస్ కీ. ॥ ఓం ॥
తుమ్ పూరణ పరమాత్మా, తుమ్ అంతర్యామీ
పరబ్రహ్మ పరమేశ్వర! తుమ్ సబ్‌కే స్వామీ. ॥ ఓం ॥
తుమ్ కరుణా కే సాగర్, తుమ్ పాలన కర్తా
మైఁ సేవక తుమ్ స్వామీ, కృపా కరో భర్ తా. ॥ ఓం ॥
తుమ్ హో ఏక అగోచర్, సబ్‌కే ప్రాణపతీ
కిస్ విధి మిలూఁదయామయ్, తుమ్‌కో మైఁకుమతీ. ॥ ఓం ॥
దీనబంధు దుఖ్ హర్తా తుమ్ రక్షక మేరే
కరుణా హస్త బఢాఓ, శరణ పడా తేరే ॥ ఓం ॥
విషయ వికార మిటాఓ, పాపహరో దేవా
శ్రద్ధాభక్తి బఢాఓ, సంతన్ కీ సేవా. ॥ఓం జయజగదీశ॥

ఓమ్ తత్ సత్



## అమావాస్యేష్టి మంత్రాలు

ఓం యత్తేదేవా అకృణ్వన్భాగధేయమమావాస్యే ।
సం వసన్తో మహిత్వా । తేనానోయజ్ఞం పిపృహి విశ్వ
వారే రయింనో ధేహిసుభగే సువీరం స్వాహా
ఇద మమావాస్యాయై – ఇదన్నమమ ॥1॥

ఓం అహమేవాస్మ్యమావాస్యా 3 మామా వసన్తిసుకృతో మయీమే ।
మయిదేవా ఉభయే సాధ్యాశ్చేన్ద్ర జ్యేష్ఠాః
సమగచ్ఛన్తి సర్వే స్వాహా॥
ఇదమమావాస్యాయై – ఇదన్నమమ ॥2॥

ఓం ఆగన్‌రాత్రీ సంగమనీ వసూనామూర్జం పుష్టం వస్వావే శయన్తీ ।
అమావాస్యాయై హవిషా విధేమోర్జం దుహానా
పయసాన ఆగన్ స్వాహా॥
ఇదమమావాస్యాయై – ఇదన్నమమ ॥3॥

ఓం అమావాస్యేనత్వదేతాన్యన్యో విశ్వారూపాణి పరిభూర్జ జాన ।
యత్కామాస్తే జుహుమస్తన్నో అస్తువయం స్యామ పతయో
రయీణాం స్వాహా॥
ఇదమమావాస్యాయై – ఇదన్నమమ ॥4॥

(అథర్వకాం – 7 । సూ – 79 । మం – 1-4॥)

ఓం అగ్నయే స్వాహా ॥5॥

ఓం ఇన్ద్రాగ్నీభ్యాం స్వాహా ॥6॥

ఓం విష్ణవే స్వాహా ॥7॥

## పౌర్ణమాసేష్టి మంత్రాలు

ఓం పూర్ణా పశ్చాదుత పూర్ణాపురస్తాదున్మధ్యతః పౌర్ణమాసీ జిగాయ ।
తస్యాం దేవీః సంవసన్తో మహిత్వానాకస్యపృష్ఠే
సమిషామదేమ స్వాహా॥
ఇదం పౌర్ణమాస్యై - ఇదన్న మమ ॥1॥

ఓం వృషభం వాజినం వయం పౌర్ణమాసం యజామహే ।
సనో దదాత్వక్షితాం రయిమను పదస్వతీమ్ - స్వాహా॥
ఇదం పౌర్ణమాస్యై - ఇదన్న మమ ॥2॥

ఓం ప్రజాపతే నత్వదేతాన్యన్యో విశ్వారూపాణి పరిభూర్జజాన ।
యత్కామస్తే జుహుమస్తన్నో అస్తువయం స్యామ పతయో
రయీణాం స్వాహా॥
ఇదం ప్రజాపతయే - ఇదన్న మమ ॥3॥

ఓం పౌర్ణమాసీ ప్రథమాయజ్ఞియాసీదహ్నాం రాత్రీణామతి శర్వరేషు ।
యేత్వాం యజ్ఞైర్యజ్ఞియే అర్ధయన్త్యమీతే నాకే సుకృతః ప్రవిష్టాః స్వాహా॥
ఇదం పౌర్ణమాస్యై ఇదన్న మమ ॥4।

(అథ - 21 సూ - 80 । మం 1-4 ॥)

ఓం అగ్నయే స్వాహా ॥5॥

ఓం అగ్ని షో మాభ్యాం స్వాహా ॥6॥

ఓం ఓం విష్ణవే స్వాహా ॥7॥

# ఆర్యసమాజ నియమములు

1. సమస్త సత్యవిద్యలకును విద్యవలన నెఱుంగదగు సర్వ పదార్థములకును ఆదిమూలము పరమేశ్వరుడు.
2. ఈశ్వరుడు సచ్చిదానంద స్వరూపుడు, నిరాకారుడు, సర్వశక్తిమంతుడు, న్యాయకారి, దయాళువు, అజన్ముడు, అనాది, అనంతుడు, నిర్వికారుడు అనుపముడు, సర్వాధారుడు, సర్వేశ్వరుడు, సర్వవ్యాపకుడు, సర్వాంతర్యామి, అజరుడు, అమరుడు, అభయుడు, నిత్యుడు, పవిత్రుడు, సృష్టికర్తయునై యున్నాడు. అతనినే ఉపాసించుట యోగ్యము.
3. వేదము సమస్త సత్యవిద్యల గ్రంథము వేదమును చదువుట, చదివించుట, వినుట, వినిపించుట ఆర్యులకందఱకు పరమ ధర్మము.
4. సత్యమును గ్రహించుటకును, అసత్యమును త్యజించుటకును ఎల్లప్పుడు సిద్ధముగా నుండవలయును.
5. సకల కార్యములను ధర్మానుసారముగా అనగా, సత్యాసత్యములను విచారించి చేయవలయును.
6. ప్రపంచమునకు ఉపకారము చేయుట, ఈ సమాజముయొక్క ముఖ్యోద్దేశ్యము. అనగా శారీరికోన్నతికి, ఆత్మోన్నతికి మఱియు సామాజికోన్నతికి పాటుపడవలయును.
7. అందరితో ప్రేమ పూర్వకముగ, ధర్మానుసారముగ, యథాయోగ్యముగ వ్యవహరింపవలయును.
8. అవిద్యను నశింపజేసి విద్యను పెంపొందింప జేయవలయును.
9. ప్రతి వ్యక్తియు తన యున్నతితోనే సంతృప్తినొందక అందఱి యున్నతిలోనే తనయున్నతి కలదని తలంపవలయును.
10. సమస్త మానవులు సర్వహితకరములగు సామాజిక నియమములను పాలించుటలో పరతంత్రులై వ్యక్తిహితకరములగు నియమములందు స్వతంత్రులగుట అందఱికి తగును.